వేంకటపతి, రోసనూరి

శ్రీవిష్ణుమాయావిలాసము

చెన్నపురి, 1898

Record no. 359

Vēṅkaṭapati, Rōsanūri.

Śrīviṣṇumāyāvilāsamu

Cennapuri, 1898.

Record no. 359

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

వేంకటపతి, రోసనూరి.

శ్రీవిష్ణుమాయావిలాసము / రోసనూరి వేంకటపతి ప్రణీతము.- చెన్నపురి
చెదలవాడ సుందరరామశాస్త్రి, 1898.

4, 4, 75 p. ;20 cm.

Record no. 359

Vēṅkaṭapati, Rōsanūri.

Śrīviṣṇumāyāvilāsamu / Rōsanūri Vēṅkaṭapati praṇītamu.-
Cennapuri :
Cedalavāḍa Sundararāmaśāstri, 1898.

4, 4, 75 p. ;20 cm.

Record no. 359

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

శ్రీరస్తు.

శ్రీ గోపాలకృష్ణ దేవో జయతు.

రోసనూరి,

వేంకటపతికవి ప్రణీతంబయిన

# శ్రీవిష్ణుమాయావిలాసము.

అను,

శృంగారప్రబంధము

తెనుఁగుపద్యకావ్యము.

ఇది

చెదలవాడ * సుందరరామశాస్త్రులవారి

శారదాంబావిలాసము ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1878

౧౮౭౮ సం ॥

చెన్నపురి.

శ్రీ

# శ్రీవిష్ణుమాయావిలాసము, విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.

—(❋) ద్వితీయాశ్వాసము. (❋)—







—❋ తృతీయాశ్వాసము. ❋—

విషయసూచిక,

సమాప్తము.

# ఉపోద్ఘాతము.

౧. ఈవిష్ణుమాయావిలాసమను తెనుఁగుశృంగారప్రబంధము శ్రీవేంకటగిరి బంగారుయాచ భూపాలాంకితంబుగా ఇంచుమించుగ క్రీ ౧౭౫౦ సంవత్సరమంతట రోసనూరి వేంకటపతి కవిచే రచియింపఁబడిన పద్యకావ్యము.

౨. ఇందు శ్రీభాగవతముఅష్టమస్కంధమునందలి శ్రీహరి మోహినీరూపంబున శ్రీశంకరుని మోహింపఁజేయుటే ప్రధానాంశముగాఁ గైకొనంబడి యదియె పెంచి రచియింపంబడియున్నది.

౩. దీనియందుఁ బ్రబంధగతధ్వని యేమన, శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాంతరంతి తే. అను శ్రీభగవద్గీతా వచనప్రకారముగ నేవారికిని భగవన్మాయ దాఁట నలవిగాదు. ఆ భగవంతుని నెవ్వరు దృఢంబుగ నమ్ముదురో వారలా మాయం దాఁటుదురు గాని పెఱవారికి సాధ్యము గాదనుట.

౪. శ్రీవేంకటగిరిపుర త్రయోవింశతితమ ప్రభువులు కాళికాభక్తులు గవీశ్వరులు నయిన శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమార యాచమనాయఁడుగారిచే నేతత్కవి తిక్కయజ్వయను బిరుదనామంబు వడసి పేరొందినవాఁడు. ఇతనికవిత్వ మ్మతికఠినము నతి మృదులము గానిది యథోచితలక్షణ సంపత్తిగలది. లేఖక ప్రమాదములు పెక్కులున్నను సాధ్యమయినకొలంది జక్కఁగావ్రాసి ముద్రింపంబడియె.

౫. ఈకృతిపతియనఁగాఁ గృతినందినవారు శ్రీవేంకటగిరి సంస్థాన ప్రభు పరంపరలో ౨౪ వవారగు శ్రీబంగారుయాచభూపాలురు. వీరు కాశీనగరంబునుండి ప్రశస్తలింగంబు నొకదానిం దెప్పించి

వేంకటగిరిపట్టణంబున శ్రీకాశీ విశ్వనాథ నామంబునఁ బ్రతిష్ఠించి ఆలయముమాత్రముకట్టించి వెంటనేగతించిరి. ఆ దేవాలయము గోపురమండపములు మొదలగునవి యిప్పటికిఁ గట్టంబడినవి గావు. వీరి భార్యలిద్దఱును వేంకటగిరి సమీపంబున సహగమనము చేసి వీరమాతలై వెలసి భర్తతో శిలావిగ్రహ రూపములుగాఁ బ్రతిష్ఠింపఁబడి నేటికిని శ్రీ వేంకటగిరి సంస్థానమువారిచే గృహదేవతలుగా నిత్యంబు నారాధింపఁబడుచు నున్నవారు.

వీరికుమారులయిన కుమారయాచమనాయఁడుగారుతమ తండ్రిగారు ప్రతిష్ఠించిన లింగమునకు గోపురము ధ్వజస్తంభము ప్రాకారముకట్టించి సకలవిధముల వృద్ధిపఱచిరి.

ఈ సమయమందు హైదరాలీకి నింగ్లీష్‌వారికిఁగలహమ్మభివృద్ధి నొందుటయు నపుడు వీరు సేనాసమేతముగా నింగ్లీషువారికి సహాయముగాఁ జెన్నపురికిం జనుటయు నట్టియెడ హైదరాలీ కొంత సైన్యమును వేంకటగిరికిఁబంపి యాయూరు పరశురామ ప్రీతిగాఁ జేయుటయు నంతనకుమారయాచమనాయఁడుగారు వెంకటగిరికివచ్చిచూచి యాయూరు రథోత్సవయోగ్యమగునట్లు వీధులేర్పఱచి మఱలఁగట్టించి యా విశ్వనాథస్వామియుత్సవంబు చక్కఁగా జరుగునట్లు వలనుపఱచిరి. ఈపనులకన్నిటికి లక్షల కొలంది పైకము వెచ్చింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది.

వీరితాతగారు తండ్రిగారునయిన ౨౩,౨౪, వ పురుషుల తరములలో వేంకటగిరి సంస్థానమువారు ఆర్కాడు నవాబువారి క్రిందనుండి ౨౫ వ పురుషులయిన యీకుమారయాచమ నాయఁడుగారి తరములో నార్కాడునవాబుద్వారకముగా నింగ్లీషువారిక్రిందికివచ్చి క్రీ,శ, ౧౮౦౨ సం॥ అగస్టు తే ౨౪ ది యిస్తిమిరారి సన్నదు పొందియున్నవారు.



౭. ఈ విష్ణుమాయావిలాసము శిథిలమగుచునున్నందున నీ కుమారయాచమనాయఁడువారి ప్రపౌత్రులే దీని నచ్చువేయించిప్రచురపఱచిరి.

౮. ఈ వేంకటగిరిసంస్థాన మూలపురుషులయిన పిల్లలమఱ్ఱి బేతాళ నాయఁడువారు మొదటఁ బ్రతాపరుద్ర మహారాజుగారికాలములో శౌర్యశౌర్యాదులందుఁ బ్రసిద్ధుఁడై సామంతరాజుగాను సేనాధిపతిగానునుండెను. అదిమొదలుగా నీసంతతివారు కాలక్రమమున నోరగల్లుమహారాజులు రాయలువారు డిల్లీ పాదుషావారు హైదరాబాదు నవాబువారు వీరలక్రింద సామంత రాజులుగాను సేనాధిపతులుగాను నుండుచు వచ్చిరి.

౯. ఈ వంశస్థులు దక్షిణ దిక్కునఁ బాండ్యదేశము మొదలు కొని యుత్తరదిక్కునఁగటకమువఱకు ననేకవిధంబులజయంబంది యాయాకాలపు సార్వభౌములవలనఁ బెక్కుబిరుదులు వడసి యున్నవారు. అందు అనపోతానాయఁడు యాచశూరుఁడులోనగువారు మిగులఁబ్రసిద్ధులు. ఈవిషయము విస్తరించుట యప్రస్తుతంబగుటచే సంక్షేపముగ వ్రాయంబడియె.

౧౦. ౨౨ వ పురుషులయిన బంగారుయాచమనాయఁడుగారుదక్షిణదేశములో నెల్లయంశంబుల వాసికెక్కియున్నందునను అప్పటి యార్కాడునవాబు సమర్థుఁడుగానుండినందునను సదరు నాయఁడువారిని ఆర్కాడు సుబాకునవాబుగాఁజేయవలెనని డిల్లీ పాదుషావారు ప్రయత్నించుచుండఁగా నయ్యంశము నత్తఱినార్కాడునవాబుగానుండిన జుల్‌ఫగార్‌ఖాన్ కర్ణాకర్ణికగావిని యాప్రభువును మోసముచే నించుమించుగా క్రీ ౧౮౯౦ లో జంపించెను. వారికుమారులే వేంకటగిరిచేరిరి. నాటినుత యిప్పటికిం దద్వంశస్థులే వేంకటగిరి సంస్థానమువారను పేరితో నున్నవారు.

౧౧. ఈవంశమునందుఁ బిల్లలమఱ్ఱి బేతాళనాయఁడు మొదలు వర్తమాన ప్రభువులయిన ౨౦ పురుషులవఱకుఁ బ్రభువులై స్వంతము గారచియించినవి కొన్ని గ్రంథంబులును భగవదంకితంబులు గాను స్వనామాంకితంబులు గాను రచియించినవి పెక్కు గ్రంథములునుగలవు. అందు శిథిలములయి నామావశిష్టము లయినవి పోను దక్కినవి యీక్రింద వివరింపఁబడును.

౧. సింగభూపాలీయము,శ్రీసింగభూపాలకృతము సంస్కృతము.
౨. వైకుంఠారోహణము,కవిమల్లన్నకవి. తెనుఁగు
౩. భానుమతీపరిణయము,వేటూరి రంగరాజకవి.
౪. విష్ణుమాయావిలాసము,రోసనూరి వేంకటపతికవి.
౫. శ్రీమద్రామాయణము,గోపినాథ వేంకటకవి.
౬. బ్రహ్మకైవర్తము శ్రీకృష్ణజన్మఖండము,గోపినాథ వేంకటకవి.
౭. శిశుపాలవధము,గోపినాథ వేంకటకవి.
౮. రాధాకృష్ణసంవాదము,మండపాక పార్వతీశ్వరకవి.
౯. దశకుమారచరిత్ర,ఎనమచింతల సంజీవశాస్త్రికవి.
౧౦. విష్ణుపురాణము,ముడుంబి అప్పయదీక్షితకవి.



శ్రీ ర స్తు.

# శ్రీవిష్ణుమాయావిలాసము.

(*) కృతిపతి నాశీర్వదించుట. (*)

శా॥ శ్రీ వక్షోజ తటీ పటీర మెదపైఁ, జెన్నొందఁగా నంజన । గ్రావేంద్రార్జునకూట కల్పిత శుభా, గారంబునం దుజ్జ్వల । ప్రావీణ్యం బగు వేంకటేశ్వరుఁడు శుం, భత్పుత్త్ర పౌత్త్రాదిక । శ్రీవర్ధిష్ణుఁడు బంగరేచ విభునిన్, శ్రీ మత్కృపన్ బ్రోచుతన్॥ ౨ ॥ మ॥ వర విజ్ఞాన కళాలవాలము చిరై, శ్వర్యైక మూలంబు వి । స్ఫురదానంద రసాభిషిక్తము పరం, జ్యోతిర్లతా శ్లిష్ట మా । దరణీ యాశ్రిత భృంగ మాత్తసుమన, స్తత్త్వాభి రామంబు శం । కర మందారము బంగరేచ నృపు భా, గ్యశ్రీనిధిన్ జేయుతన్ ॥ ౩ ॥ మ ॥ లలితాంభోరుహలీల గేరు మొగముల్, నాల్గున్ జతుశ్శాఖలై । విలసిల్లంగ సరస్వతీగృహిణి యా,విర్భూత కౌతూహలా । కలనన్ మీఁఱఁ దనర్చు పద్మజుఁడు వే, డ్కన్ బ్రోచు వెల్గోటి స । త్కులరత్నం బగు బంగరేచ విభు న, స్తోకాయు రైశ్వర్యముల్ ॥ ౪ ॥ మ ॥ సుమహా కౌస్తుభ దీప్త దీప కళికల్, శోభిల్ల హారావళుల్ । కమనీయా వరణ ప్రకారములుగాఁ, గాంతాయ తోరఃస్థలో । త్తమ ధామంబునఁ జెజరిల్లుసిరి ని, త్యంబున్ గుమారేచ పు । త్త్రమణిన్ బంగరుయాచ భూవిభుని సా, మ్రాజ్యస్థితున్ జేయుతన్ ॥ ౫ ॥ సీ ॥ అడుగునెత్తమ్ములఁ, బొడమిన మినువాఁక కన్నియ సవతిగా,నున్న యున్న । కొండ విల్లుగ నుండు, మిండ జంగము సామి చెలిమి సేయుట కుండు, చెలువు చెలువ । పసిఁడి పుట్టము దాల్పు, పసిగాపు మన్నిని నెచ్చెలి యనైన,

నెలంత మిన్న । పాంప బోనము మెక్కు, పక్కి నెక్కెడు రౌతుం బ
ట్టిగాఁ గనినట్టి, గట్టుచూలి ॥ ౬ ॥ తలను నెలపువ్వు దాల్చిన, తలిరు
బోణి । సర్వమంగళ వెలుగోటి, సత్కులాఢ్యు । బంగరేచేంద్రు స
త్పుత్త్రి, పౌత్త్రవిభవ । చిరతరైశ్వర్య సంపన్నుఁ, జేయుఁ గాత ॥
౭ ॥ చ ॥ విలసదురు భ్రమద్భ్రమర, విభ్రమవేణి విపంచికా శుకీ । జ
లజవరాక్షదామధర, సారసపాణి సుధారసార్ద్ర ని । స్తులమృదు
వాణి వాణి దయ, తోడను వెల్గొటి బంగరేచ భూ । తలవిభు సత్య
వాగ్విభవ, తత్పరనిత్యుని బ్రోచు నెప్పుడున్ ॥ ౮ ॥ ఉ ॥ సంతత మం
తరాయతమ, సంబుల కేఘనుఁ డంశుమంతుఁ డా । శాంతర భక్తలో
క హృద, యాబ్జని శాంతుఁడు శాంతుఁ డున్నతా । త్యంత దయాంత
రంగుఁడగు, దంతి ముఖుండు కుమారయాచ భూ । కాంతుని బంగ
రేచవిభు, కామితముల్ కృపఁ దీర్చుఁ గావుతన్ ॥ ౯ ॥

—(*) ఇష్టదేవతాసుతి. (*)—

సీ ॥ సగుణ నిర్గుణ కళా, సంధానతను భువి నఖిలదిక్కులఁ
బూజ, లందఁదలఁచి । తొలుదొల్త నెందు భూ, తలనాథునకుఁ బ్ర
సన్నుఁబియు సిద్ధగ, ణంబుగొల్వఁ । గల్పాదిసర్వమం, గళతోడఁగూడి
లో కత్రయం బెఱుఁగంగఁ, గమలగర్భ । పంచ యజ్ఞోద్భవ, భసిత
పంచకఖనీ ముఖచారు దక్షిణ, ముంజివంత ॥ ౧౦ ॥ ధాత్రి ధరశృంగ
నిలయుని, త్యప్రదీప । భూపతీశ్వరనామ వి, స్ఫూర్తి వెలసె । నస
దృశోత్కంఠు శ్రీకంఠు, నభినుతింతు । సకల జగదంతరాత్ము మ, త్స్వాం
తమందు ॥ ౧౧ ॥ మ ॥ ప్రమదంబొప్ప శుభప్రదాన విలస, త్పంచా
క్షరీ మంత్ర రా । జము నాత్మేశ్వరుచేత వేగ నుపదే, శంబొట్టకై యా
త్మనెం । చి మహీన్ క్ష్మాధరమౌని రాజ సుతయై శ్రీ, కాళహస్తిం
బురీ । శమృడున్ గూడిన దేవిఁ గొల్చెదను శ్రీ, జ్ఞానప్రసూనాంబికన్ ॥



౧౨ ॥ శా ॥ రాజున్ దైవమునైన రామునిచరి, త్రం బెల్ల లోకంబు
లన్ । బూజార్హంబగు కావ్య రూపమున నే, పుణ్యుండు గల్పించె
ని । ర్వ్యాజాచార కవిత్వ తత్త్వధనుఁడ, వ్వాల్మీకి నెంతున్ దపో ।
భ్రాజిష్ణున్ సుసహిష్ణు నిత్యసుగుణ, ప్రాలంకరిష్ణున్ మదిన్ ॥ ౧౩ ॥
ఉ ॥ సంశయముల్ దొలంగ శ్రుతి, సంఘములన్ విభజింప భూమి వి
ష్ణ్వంశము దాల్చి పుట్టి ధర, తాన్వయవర్ధనమున్ ఘటించి వి భ్రాం
శ మొకింతగల్గని త, పః ప్రభు దేవమునీంద్రవంద్యుఁ డం । డాంశుకృ
పా నిరంతరు మ, హాత్ముఁ దలంతుఁ బరాశరాత్మజున్ ॥ ౧౪ ॥ చ ॥
అసదృశ కాళికావర మ, హాత్మ సమున్నతి యాత్మయందుఁ బెం । పె
సఁగ మహోపమానపద, పేశల కౌశల చిత్రగుంభనల్ । పొసఁగ
ననేక కావ్యములు, పొంపొనరన్ రచియించె ధాత్రి నే । రసికుఁడు కా
ళిదాస, కవి రాజతనిన్ నుతియింతు వేడుకన్ ॥ ౧౫ ॥ ఉ ॥ వాగను
శాసనప్రకట, వర్ణ వినిర్ణయ మేర్పడన్ సము । ద్యోగకవిప్రయో
గముల, కొప్పుగ నొప్పుచు నాంధ్రభాషకున్ । దాగురువై యొనర్చె
విను, తస్థితి లక్షణ లక్ష్యముల్ తదిం । ద్రాగసమాను లోక హితు,
నార్యుని నన్నకవి న్నుతించెదన్ ॥ ౧౬ ॥ ఉ ॥ వ్యాస వచస్తరంగ బ
హు, లార్థ జలగ్రహభారతాబ్ధి మే । ల్వాసిగఁ బారమున్ గనఁ గ,
లంచియు సద్గురు భక్తిగల్గన । భ్యాస కవిత్వమార్గ గమ, నాధికుఁడై
తగుతిక్కయజ్వభా । షా సముదాత్తు శంభుపద, సారస షట్పదచిత్తుఁ
గొల్చెదన్ ॥ ౧౭ ॥ మ ॥ స్వవశంబైతగు కాళికా వరకృపా, సంపూ
ర్ణతన్ శబ్దశా । స్త్రవచిత్రార్థ సలక్షణక్రమ నిరూ, ఢప్రక్రియాస్వీ
తమా । కవితా తత్త్వమహత్త్వమున్ సభల, వక్కాణించె నే మేటిభ ।
వ్యవచోమాధురి నాపెద్దనార్యకవి పె, ద్దామాత్యుఁ గీర్తించెదన్ ॥ ౧౮ ॥
క ॥ మహీ నాథునికకవీశ్వర । మహనీయాత్ముల దయా స, మర్థ్యులనా
నా । బహుమాన రాజపూజా । వహులన్ వినయమున నెంచి, వా

గ్వీభవమునన్ ॥ ౧౯ ॥ ఉ ॥ చాలఁగ దోషముల్ దెలియఁ, జాలక నల్లిక లల్ల నేర్చుటన్ । రేలుఁబగళ్ళు సత్కవుల, రీతిని నిక్కిన కాకవుల్ ధరన్ । బోలరు సత్కవీశ్వరుల, పొందిక రాజమరాళ పుంజముల్ । పాలును నీరు నేర్పఱచు, భావము కాకములందుఁ గల్గునే ॥ ౨౦ ॥ మ ॥ అని మున్ మున్న యభీష్టదేవతల క,త్యానందమౌ వందనం।బును గావించి పురాణ సత్కవులనన్,భాషించి సద్వైతమా। ర్గనిరూఢక్రమ కాకవి ప్రతతులన్, ఘర్షించి వేడ్కల్ ఘటిం। చిన చిత్తంబున వాగ్విచిత్రకలనా, శృంగార మేపారఁగన్ ॥ ౨౧ ॥ క ॥ వింతగ నొక కృతి సేయఁగఁ । జింతించుచు సకలరీతి,శృంగార కళా । క్రాంత మగున ట్లు గాఁగను । సంతసమున నుండునట్టి, సమయము నందున్ ॥ ౨౨ ॥

—* బంగారుయాచ భూపాల వర్ణన. *—

చ ॥ పటుభట హేమ మందిర శు,భక్రమ రత్న కవాటకూట వి । స్ఫుటతర సాలఖేయ నవ,సుందర పద్మవితాన సంభ్రమో। త్కట మదనాగ వేగ జిత, గౌరవ వాయు తురంగమైన వేం। కటగిరి రాజధాని నతి, కౌతుకకీర్తి కళాభిరాముఁడై॥ ౨౩ ॥ సీ ॥ తన పరాక్రమము యు,ద్ధవిరోధి రాజన్య కంఠహారక్రియా, క్రమము గాఁగఁ। దన శాసనంబుది, క్తటవల్లభుల శిరః కోటీర మాణిక్య, కోటిగాఁగఁ । దన యశశ్చంద్రిక, దశదిశావలయసం స్థానాధిపులకు న, త్రింబుగాఁగ । తనవచోత్పత్తికి, త్యతరాయ రాహుత్త సంతతి కమృతాన్న, సరణి గాఁగ ॥ ౨౪॥ తన కటాక్షంబు శ్రితజనో, ద్భాసవనవ । సంతనైరంతరీవిలా, సంబు గాఁగ । వెలసినకుమార యాచభూ, విభుకుమారుఁ। డెలమి వెలుగోటి బంగారు, యాచ విభుఁడు॥ ౨౫ ॥ చ ॥ సలలితమైన భూతలము,శాశ్వతవైఖరి నేలు విక్రమో। జ్జ్వలుఁడభియాతిభీకరుఁడు,సద్గుణశాలి నయాన్వితైక ని । శ్చల విభవామరేశ్వరుఁడు,సారదయారస



మూర్తియైన య। వ్వెలుగోటి బంగరేచ పృథి,వీపతియర్థి చకోరచంద్రుఁడై॥ ౨౬॥ సీ॥ తన మహోజ్జ్వలయశో,ఘనసార రాశికిఁ బృథులాబ్జ జాండంబు పేటిగాఁగఁ। దన ప్రతాపారుణో,దయ విభ్రమంబున కమరాచలము కృత,కాద్రి గాఁగఁ।దనదాన ధారావి, తానాంబుఝరముల కంబుధి చుళిక మా,త్రంబుగాఁగఁ। దనవరోరూపసౌం,దర్య ప్రభా పాళి కబ్జబాణుఁడు శతాం,శంబుగాఁగ॥ ౨౭॥ గీ ॥ నలరు వెలుగోటి కులసుధా, జలధిపూర్ణ । పూర్ణిమా చంద్రుఁడౌ బళీ, బుధనుతైక । సరసగుణహారి మత్తారి, జనవిదారి । యలదు నేదారి బంగారు, యాచశౌరి ॥ ౨౮ ॥ సీ ॥ ఏ రాజు నిరతంబు, సారామృతాన్న ప్రదాతయై భూదైవ,తములఁ బ్రోచె । నేరాజ హంసంబు, హిత సుహృత్పద్మిని సరసులు పొదలంగ, సంచరించె । నే నరేంద్రుఁడు వైరి, సైనికాహీశ్వర కోటిఁ గారాగార, పేటినుంచె । నేవసు ధేశ్వరుం,డే వేళ వితరణ శ్రీకరాంభోరుహ, రేఖగాంచె ॥ ౨౯ ॥ గీ ॥ నెప్పు డాతండు ఘనకుమా, రేచ విభుని । గర్భవారాశి సంపూర్ణ, కాంతిచంద్రుఁ। డవని పతి మాత్రుఁడే మది, నరసిచూడ। నిలను వెలుగోటి బంగారు,యాచవిభుఁడు ॥ ౩౦ ॥ సీ ॥ తనకీర్తి చంద్రికల్, జనచకోరానంద కరములై రోదసిఁ, గలయఁ బర్వ। దనమహాకోప ప్రో, తాపానలము శత్రు నీర సారణ్యంబు, నేపడంపఁ । దనసార సౌందర్య, తారుణ్యసంపద యువతి విలోచనో, త్సవమొనర్పఁ। దనకటాక్ష స్ఫూర్తి, దశదిశాగతకవీ శ్వరఫలోదయ హేతు, సరణిఁబొదల॥ ౩౧ ॥ వెలయు ధనధాన్య లక్ష్మి, నుజ్జ్వల విలాస । మహితుఁ డగు వెలుగోటి కు, మారయాచ। ధరణి పతి నందనుండు వి,ద్వన్నుతుండు। బలయుతుఁడు బంగరేచభూ, పాలకుండు ॥ ౩౨ ॥

—(*) శ్రీవారిసభావర్ణన. (*)—

సీ ॥ ఖద్యోత మణిమయ, ప్రద్యోతకుడ్యభాగముల భోగ

ములఁ జక్రములు పెనఁగ। శక్రనీల స్తంభ, సంభృత ఘన మనః కలన
ను ద్వృత్తిఁ గేకులు నటింపఁ। బగడంపుఁ గొణిగెలఁ, బట్టెను కార్భక
కులము ఫలాపేక్ష, కోరు చుండఁ। జంద్రోపలక వాట, సాంద్రవంత
పుఁ గోరికలఁ జకోరికలు విందులకుఁ దిరుగ ॥ ౩౩ ॥ కృత సరోవర
జలజను, స్థితమరాళ। కామినీ కాము కాంశుక, కరవితాన। శిల్ప
పరికల్ప కానల్ప, చిత్రములఁగ। రంబు పొగడొందు కొల్వు కూటంబు
నందు ॥ ౩౪ ॥ సీ ॥ బంధురనీతియు, గంధరుండ క్రాంత కాంతవిశ్రాణ
న, కంధరుండు। గాంభీర్య వినయ విక్రమ దయారసవీర రాఘవుఁడ
సమాత్రు, లాఘవుండు। కమనీయ రూపరేఖాకార నవకళా సుందరుం
డతిభాగ్య, మందిరుండు। చతుర విద్వత్కవీశ్వర బాంధవాశ్రిత శ్రీ
కరుఁడ నఘ గుణాకరుండు ॥ ౩౫ ॥ గీ ॥ తనరె నిజ సాయకాసన, ఘన
విముక్త। శారధారా ప్రశమితారి, జన్యదుష్ప్రతాపవనచిత్రభా
నుఁడు, దారకీర్తి। హితుఁడు వెల్గోటి కులబంగ, రేచవిభుఁడు ॥ ౩౬ ॥ సీ ॥ ఒ
కపంక సామంత, నికురుంబ మకలంక రాజ్యాంగ లక్షణ, క్రమము దె
ల్ప। నొకదెస సరదాలుగ, మకుటముల్ గలరాజ కుంజరుల్ ముదము
నఁ, గొలిచి యుండ। నొక క్రేవఁగవిగాయ, కోత్తమసాహిత్య సంగీత
సార ప్రసంగ మెసఁగ। నొకచాయ భూజన, ప్రకరముల్ సదుపా
య నకరాబ్జులై చేరి, నతులు సేయ ॥ ౩౭ ॥ వంది సందోహ రవము
లు, సందడింప। మహిత రత్న ప్రభా సభా, మండపమున। వెల
య నొడ్డోల గంబుండి, వేడ్కశౌర్య। శాలియగు బంగరేచభూ, పా
లకుండు ॥ ౩౮ ॥ వ ॥ మఱియు నిందిరా సుందరీ రమణీయా నందకంద
ళిత పరిమళద్రవ్య సంభావ్య దివ్యతర ఘుమ ఘుమాయ మాన వాసనా
నూన వాసితంబును జండపవన వేదండ మండలోద్దండ మస్తకస్థలనిర్ఘా
తకంఠీరవభైరవనఖాగ్రముక్తముక్తాఫలప్రయుక్తసముద్భాసితద్వారతో
రణాభిరామంబును, భారత రామాయణ పురాణ మర్మకర్మ నిర్మాణ



ప్రవీణచిత్రపట విచిత్రితంబును సమున్నత విభ్రమాభ్రంకష పరిమాణ
కనత్కనక కలశ సంభూత సంరంభ చణ చ్ఛాయా భ్రమిత దిగ్జృంభ
మాణంబును నై లోకపాలుర సభాప్రభాసమాన నిష్ఠా గరిష్ఠాతి శయ
శ్రేష్ఠత్వంబు ననుకరించు నిజసభా మండపంబున నవరత్న ఖచిత కాం
చన సింహాసనంబునం బేరోలగంబునఁ గుండలి మండలేశ్వర ముఖ ముఖ
రితవాక్పాటవగళద్ధారా ధోరణీప్రశస్తశబ్ద కర్తృమీమాంసానవద్యభా
షావిశేష నైపుణీకరణ మండితులగుపండితులును భారత భాగవతాద్య
ష్టాదశ పురాణ గాథా నిధాన నవాభ్యుదయ సంజ్ఞా ప్రజ్ఞాధిక నిజప్ర
భావిభాస మాన మాననీయ విప్రసంగ కారణికులగు పౌరాణికులును
వేద వేదాంగ విత్ప్రతిపాదితాచార ధర్మాధర్మ నిగదిత కృత్యోపదిష్ట స
మాహితులగు పురోహితులును సంస్కృతాంధ్ర భాషాష్టక విశిష్ట శబ్ద
సౌష్ఠవ మాధురీ వచోరచనా లంకార సంకలిత పద్య గద్య సలక్షణ
ప్రాబంధికబంధురులగు కవితా ధురంధరులును లయ నిలయ కాలస్థూ
ల సూక్ష్మ మితామిత్ర మిశ్ర వృత్తిభేద స్వరకల్ప నాభి నయ చాతురీ క్రి
మణ భేద్య తంత్ర వాద్య నృత్తగీత ప్రబంధానుబంధగాన విద్యా వి
ధాయకులగు గాయకులును దారకాచార గుణగణన సమాయోగయో
గకరణ నవగ్రహావగ్రహాదివి నిర్ణయ ప్రదృశ్యులగుజ్యోస్యులును దశ ది
శాపరీత భూతలాధీశ్వర సంస్థానాగత వర్తమాన కర్తవ్య కార్య ఖడ్గ
పక్షా పక్ష ప్రతీకార నిరూపణ మేధా విధా త్రుపమాన క్రియా ధౌ
రంధర్యులగు ప్రధాన వర్యులును దృశ్యశ్రవ్యాది ప్రబోధపాకవృత్తిరీతి
పాంచాల శయ్యానుకరణ వాచామగోచర పద్య గద్య పఠనా భటాటు
లగు భటులును మహానటనటన సమాటీకన ప్రకటు లగు నటులును నిజ
పరాక్రమా వక్ర విక్రమార్క క్రమాకారులగు శూరులును నవయౌ
వన కళావిలాస బంధుర ధౌరంధరీప్రభావ నిర్జితానంత నిర్జరావా
స మేనకాద్యప్సర స్సాంగశృంగారలగువారాంగనలును బరివేష్టింపఁ గొ

లువుండెన సకలవిద్యావిచక్షణా ధ్యక్షమనఃకంజరంజనంబున సాదిమరా
జన్య చరితంబులు కృతిముఖంబునం బ్రబలుటకుం బ్రబలులగు సుకవి నిక
రంబులు కారణంబులని తలంచి కవిగంధ సింధురంబులతో మృదు మధు
రాలాప ప్రవర్షితుండగుచు ముఖారవింద మందస్మితంబున ॥ ౪౭ ॥

—(*) గ్రంథకర్తృసత్కారము. (*)—

మ ॥ నను శ్రీ భూపతి లింగపాప భజనా, సందుక్ గుమా
రేచ భూ । జన పాలాగ్రణి తిక్కయజ్వుఁ డనుచుక్, జాలంగఁ బేరిచ్చి
పి । చిన నెం పొందిన రోసనూరికులు, నిక్ శ్రీ వేంకటాఖ్యుక్ గృ
పా । ఘన గంభీర శుభైక దృష్టి వెలయం, గాఁ జూచి పల్కెక్ దగక్॥
౪౮॥ క ॥ నీవాక్కకృతిఘటింపఁగ । భావంబునఁదలఁచియున్న, బహు
విధ శృంగా । రావి భవ మగు తత్కృతి । శ్రీ వెలగఁగ నంకితంబు,
సేయుము మాకున్॥౪౯॥మ॥ శ్రీ నారాయణ చర్యమై యిహపర, శ్రే
యస్కరం బైశివా । జాని స్వాంత మహాను రాగ యుతమై, సర్వక్రి
యా సంపదక్ । మానై సుందర బంధుర స్థితులఁ బ్రేమక్ విష్ణు మా
యా విలా । సా నూనంబుగ సత్కృతిక్ విరచితం బై యొప్పగాఁ జే
యుమీ ॥ ౫౦ ॥ చ ॥ అని బహుమాన పూర్వ విన,యాదర తోషణమం
జు భాషణా । ద్యనుపమ కర్ణ భూషణ న,వాంబర సంభృతుఁ గాఁ
గ వేడ్క ని । చ్చిన కపురంపుఁ దమ్మలము, చేకొని మంచి దటంచు
నెమ్మనం । బున నను రాగవల్లికలు, పొంపు దలిర్పఁగ సమ్మతంబునక్॥
౫౧ ॥ సీ ॥ ఏవర్ణ నీయుఁడీ, యిలను శ్రీహరిపాద జలజజాతుఁడు ప
ద్మ, కులుఁ డనంగ । నే బంగరేచ భూ,మీశ్వర సతివీర మాంత సుపౌ
త్త్రుఁడీ, మహి నుతింప । నే కుమారేచ భూ, మీంద్రుని పట్టంపుఁ గో
మలి కమ్మకర్, కును సుపుత్త్రుఁడే బంగరేచ మ,హీమండలాధ్యక్షుఁ
డభి నవ విష్ణు మా,యావిలాస ॥ ౫౨॥ సత్కృతికి నాథుఁడాతని, సన్ను



తింపఁ । దగిన నాకైన భాగ్య మెంతని వచింతు । ననుచు మదిలో
న సంతోష, మగ్గలింప । నెఱసి మఱియును దృఢ బుద్ధి, నిప్పటిలఁగ॥
౫౩॥శా॥శ్రీ వెల్గోటి కుమార యాచ నృపరా, జీవాత్మ సత్పుత్త్రుఁడున్ ।
భావాభిజ్ఞుఁడు బంగరేచ ధరణీ, పాలాబ్జ బాణుండు మ । ద్ధీవాక్సం
దర భవ్యకావ్యరతి క,ర్థిన్ భర్తయై యొప్పటన్ । సౌవర్ణాంబునది
వ్యరత్నమొగిఁ జే,ర్చంగల్గిన ట్లేతగన్ ॥ అనితలంచి ॥ ౫౪ ॥

—(*) షష్ఠ్యంతములు. (*)—

క ॥ ఏవంవిధ సద్గుణికిం బ్రి । భా విజితవిలాసనిత్య,భాస్క
రఘృణికిన్ । శ్రీవాగ్విశేష ధీమ । ద్భావాదిమఫణికి నేచ, పార్థివమ
ణికిన్ ॥ ౫౫ ॥ క ॥ భూజన వినోద విద్యా । భోజునకున్ స్మితవి
లాస, పూర్ణైకముఖాం । భోజునకుఁ గీర్తికన్యా । పూజిత తేజున
కుఁగవి న,భోభూజునకున్ ॥ ౫౬ ॥ క ॥ పద్మకుల సంభవునకున్ । ప
ద్మా కరుణాకటాక్ష, భరితాత్మునకున్ । పద్మాప్తధామ తతికిన్ ।
పద్మాదినిధీశ సదృశ, బహుధనపతికిన్ ॥ ౫౭ ॥ క ॥ సిత కేతనునకుఁ
ద ద్విల । సితకాంతిఁగఠోర శత్రు, చేతోభీతి । స్థితి హేతునకును భూ
నుత । సతత పరాక్రమవిశాల, సంజాతునకున్॥౫౮ ॥ క ॥ ధైర్యామ
రాద్రికిని గాం । భీర్య సముద్రునకు సుజన, బృందస్తుత స । త్కార్యసు
చర్యునకు సుఖ । స్థైర్యునకున్ బంగరేచ, జనవర్యునకున్ ॥ ౫౯ ॥
క ॥ వెలుగోటి వంశ శుభకర । కలశాంబుధి పూర్ణచంద్ర, ఘనకీర్తి
కళా । లలితునకు సజ్జనావన । బలచింతామణికి యాచ, పార్థివ
మణికిన్ ॥ ౬౦ ॥ క ॥ శ్రీయుతముగ నంకితముగ । జేయంగాఁ బూ
నినట్టి, శృంగార కళా । శ్రేయోదాయక హరిహర । మాయాలీలా
కథాక్ర, మం బెట్లనినన్ ॥ ౬౧ ॥

# విష్ణుమాయావిలాస

## కథాప్రారంభము.

క ॥ నారాయణుండు కృత్రిమ । నారీ రూపమున నిత్య, నవ సుందర శృం । గారకళా లావణ్య । ప్రారంభముదాల్చి దనుజ, పతులు భ్రమింపన్ ॥ ౬౨ ॥ క ॥ కులుకుల నటనిల్చి సుధా । కలశము నోటించి వేగఁ, గైకొని యావే । ల్పులకు నొసంగె సువంచన । పలుకుల నమృతంబుగులుకఁ, బ్రహసిత ముఖుఁడై ॥ ౬౩ ॥ క ॥ జనమేజయ జనవల్లభుఁ । డను వైశంపాయనునకు, ననిమిషులుసుధా । వనధి మథియింప జనియుం । చిన సుధతాఁ బంచిపెట్టెఁ, జెలువాగఁగులన్ ॥ ౬౪ ॥ క ॥ వనజాక్షుఁ డవ్విధంబున । నెనసినయవ్వు డిట్లు మోహి, నీరూపమ్మున్ । గని కుమతు లగుట దనుజులు । మొనసిరి భ్రమ సద్వివేక, ముఖ్యజ్ఞానుల్ ॥ ౬౫ ॥ మఱి యెవ్వరైన బ్రమసిన । పురుషులుగలరొక్కొ యీ త్రి,భువనమ్ములలో। నెఱిఁగింపుము వినవేడుక । పరిగొనెనా మదికిఁజెవ్వుల, పండువుగాఁగన్ ॥ ౬౬ ॥

## —(*) మోహిన్యవతారప్రస్తావన. (*)—

క ॥ అనవిని వైశంపాయన । మునియిట్లను సకలభువన, మోహనుఁడగు వి । ష్ణునిమాయ కెవ్వరైనన్ । విను బ్రమయని వారుగలరె, విశ్వేశ్వరతన్ ॥ ౬౭ ॥ క ॥ ఫాలాక్షుఁడైనఁ గానీ। వాలాయము విష్ణుమాయ, వలనను నానా । లీలల భ్రమఁజెందక పోఁ। జాలండన నిష్పడితర, జనులకు వశమే ॥ ౬౮ ॥ గీ ॥ విష్ణుమాయావిలాసమ వ్విధమునీకు । తేట తెల్లంబు గావింతుఁ, దెలియవినుము । బుద్ధిఁ దలకొన సంకల్ప, సిద్ధిగాఁగ । నఖిలగుణసాంద్ర జనమేజ, యక్షితీంద్ర ॥ ౬౯ ॥



## —(*) కైలాసగిరివర్ణనము. (*)—

సీ ॥ మందారమల్లికా, కుందచందనపిచు మందకల్పద్రుమ, సుందరంబు । శారికా శుకపికీ, చంచరీకారవో త్సుకసురీకల గాన, శోభితంబు । సామజ భల్లూక, శరభశంబర సింహ ఖడ్గాదిమృగలస, త్తటాంధరంబు । గంధర్వగుహ్యక, గణయక్ష రాక్షస దేవచారణ సిద్ధ, సేవితంబు ॥ ౭౦ ॥ గంధ బంధుర సౌగంధి, కారవింద । సారకాసార సురుచిరో, ద్ధారచక్ర । వాక బకహంస కారండ, వారవంబు । భక్తఫలదంబు కైలాస, పర్వతంబు ॥ ౭౧ ॥ సీ ॥ అణిమాది విలసితా, ష్టైశ్వర్య ధుర్యంబు శోభన మందిర, సుందరంబు । గోపురప్రాకార, దీపితాటోపంబు వృషభతోరణ సమా, వృత ఘనంబు । రుచిరారవింద స, రోవరప్రకరని రంతర కలహంస, కలకలంబు । ఫలితపుష్పితబహు, పాదపోపవనంబు షడృతు ధర్మప్ర, సాధితంబు ॥ ౭౨ ॥ గరుడ గంధర్వ కిన్నర, గణవిచిత్ర । నైజ విద్యావిలాసవి, భ్రాజితంబు। పూర్ణిమాచంద్ర చంద్రికా, స్ఫురితధవళ । భాప్రదీప్తంబు కైలాస, పర్వతంబు ॥ ౭౩ ॥ సీ ॥ కమనీయ పద్మరా, గస్తంభ సంభృతా యత కూర్మ మకరికా, ద్భుతకరంబు । దీపిత చంద్రికాం, తోపల మయసార సోపాన పఙ్క్తికా, సుందరంబు । లాలిత స్ఫటికశి, లాసాలభంజికా కరకలశచ్యుత, కందళంబు । నవరత్నమయతోర,ణ ద్వార బంధవిస్ఫుట కవాటప్రభా, శోభితంబు ॥ ౭౪ ॥ రాజసేవార్థ సంచార, రమ్యవిభవ । బంధురానేక మందిర, ప్రాభవంబు । నఖిలదిక్తటి మణిఘృణి, నిరుపమాన । భర్మహర్మ్యంబు కైలాస, పర్వతంబు ॥ ౭౫ ॥ ఉ ॥ ఇంపుఘటింప సాంద్రశర, దిందునిభంబగు తన్నగంబునన్ । దెంపలచుట్టుమీద నొగిఁ, దేజమెలర్పఁగఁ బూచి యొప్పునా । సంపెగపూలు హేమ రుచి, సంపద వెండి పసిండిగుండ్ల పెన్ । గుంపులునైమరిన్ శిఖర, గోపుర వేదికలై ప్రభిన్ దగున్ ॥ ౭౬ ॥ ఉ ॥ అందు నవేందు

కాంతమణు, మైన శుకీపిక కేకిశారికా । సుందర చిత్రశిల్పములు, చో
ద్యకరంబు సమస్తలోక స । ద్వందిత నిస్తులాభ్యుదయ, వైభవలీల నె
సంగు కేళికా। మందిర బంధురంబు లస, మానవినోద విలాసవైఖరిన్॥
౭౭ ॥ సీ॥ ఏచాయఁ జూచిన, నెలమిఁ జక్కనిరుద్ర కన్యాసహస్రశృం,
గారశేష్ట । లేదారిఁగనుగొన్న, హేరాళ నవరత్న చిత్ర తోరణ క
ళా, శ్రీకరంబు । లేవంకఁజూచిన, లేమావిగుంపుల క్రీనీడఁగిన్నరీ, గీత
రీతు । లేజాడవీక్షింప, హేమార విందకా సారసౌగంధిక, సౌరభం
బు ॥ ౭౮ ॥ లెచటఁ బరికింప బహువజ్ర, నిచయశృంగ । కనకవైడూ
ర్య దండకే, తననితాంత । వృషభచిహ్న సముజ్జ్వల, విధములమ్మ ।
హాశివస్వామి నవవిధా, త్యంతభూమి ॥ ౭౯ ॥

—❋ కైలాసవాస సాంబమూర్తివర్ణన. ❋—

క ॥ ఆశైలాధీశుండు మ । హాశివుఁ డఖిలేశుఁ డాశ్రి,తావనుఁ
డు సమ । స్తాశా పరిపూర్ణుండు భవ । పాశ హరుఁడు భవుఁడు
భక్త, పాలుండెపుడున్ ॥ ౮౦ ॥ సీ ॥ తనదు ఎల్లయిసుర,ధరమునెత్తి
నిబూల వలెఁదాల్చె నక్షత్ర, కులము ననఁగఁ। దనశరంబయి మురాం,
తకుఁడు త్రిలోకైక వందనీయస్ఫూర్తి, వఱలె ననఁగఁ । దనకుభూష
ణముగాఁ, దగియనంతుఁడు సర్వ భూభారహీనుఁడై, పొల్చెననఁగఁ ।
దనవిలోచనములౌ, టనుసూర్య శశివహ్ను లార్యాభిహితవృత్తి, నతిశ
యిల్లి ॥ ౮౧ ॥ రనఁగ నగులోకగురుఁడుస, ర్వాత్మకుండు । విశ్వమ
యకాయుఁ డభినవ, వేదవేద్యుఁ । డాదిదేవుండు గంగాజ,టాంతరుం
డు । నలఘుతరమూర్తి గిరిజాస, హాయుఁడగుచు ॥ ౮౨ ॥ సీ ॥ ఒక
వేళ నణిమాది, యోగసిద్ధులసిద్ధ భాషణాశ్లేషణ, ఫణితికలరు । నొ
కవేళ రుద్రక, న్యల యాటపాటలు నాలించుచుండుఁ జి, త్తానురక్తి ।
నొకవేళ శుకపిక, నికరసుస్వరచణ వాటికల్ గనునిరా, ఘాటలీల। నొ



కవేళ నిండుకొ, ల్వుండి వారిజసంభ వాదుల మనువుల, నాదరించు ॥
౮౩ ॥ వొక్కవేళను వ్యాఘ్రాజి, నోత్తరీయ । విపుల పరిధానుఁడైత
పో, వృత్తినుండు । తత్త్వవిజ్ఞాన చింతన, ధ్యాననిష్ఠ । నతిగరిష్ఠా
త్మవర్తియ, య్యష్టమూర్తి ॥ ౮౪ ॥ సీ ॥ ఉదితేందుబింబంబు, నొర
యునె మ్మోమునఁ జిఱునవ్వు వెన్నెలల్, చెంగలింప । నపరంజి బిందె
ల, యందంబుగల కుచ స్థలిఁ దారహారము, ల్తాండవింప । లలితేంద్రనీ
లశ, కలకాంతి వెదచల్లు వేణీరుచిశ్రేణి, వేడ్కఁబెనుపఁ । బద్మరాగ
ప్రభ, ల్పాయుపయి నిగిడించు చరణాంబుజద్యుతు, ల్పరిఢవిల్లఁ ॥ ౮౫ ॥
గాంచికాధామ కింకిణీ, కంకణాను । రావమంజీరములు కలా, రవ
ము లెసఁగ । నాళికైదండగొని రాజ, హంసయాన । మొనర పార్వ
తి సనుదేర, నొరపుమీఱ ॥ ౮౬ ॥

—(❋) సాంబమూర్తి సభావర్ణన. (❋)—

శా ॥ ఆకైలాస నగాగ్రశృంగమణి సౌ; ధాభ్యంతర స్థానక ।
శ్రీకల్యాణ విచిత్రరత్న విలస, చ్ఛృంగార పీఠంబుపై । లోకాతీతుఁడు
నిండుకొల్వయి సుర, ల్లోకంబులున్ సర్వమున్। సాకారంబుగవచ్చి త
న్నుఁగొలువన్, సర్వజ్ఞమూర్తిప్రభన్॥ ౮౭ ॥ వ ॥ ఇట్లనంతకోటిబ్ర
హ్మాండంబులు నణిమాద్యష్టైశ్వర్యంబులు నఖిల వేదంబులు నాదిత్యు ల
గ్ను లమరులు నాదిమధ్యాంతంబులు నహంకార మమకారంబులు గుణ
నిర్గుణంబులుఁ గామక్రోధంబులు నల్పానల్పంబులుఁ గల్పా కల్పంబులు
యోగవియోగంబులు యుగంబులు జగంబులు నగంబులు మృగంబులు ఖ
గంబులు నదీనదంబులు నస్త్రంబులు శస్త్రంబులు శాస్త్రంబులుఁ బురా
ణంబులు సంఖ్యాసంఖ్యంబులు సంధ్యాసంధ్యలు సత్యాసత్యంబులు మం
త్రతంత్రంబులుఁ దామసరాజస సాత్త్వికంబులు యజ్ఞంబులు దిక్కులు
దిక్పాలురు రాజర్షులు నిధులు జలనిధులు జలజాతంబులు సర్వవిద్యలుఁ

జంద్రసూర్యతారకాగణ సముదయంబులు రక్షో యక్ష రాక్షస దైత్య దానవ మునిపక్షి గరుడగంధర్వ కిన్నర నరవానర సరీసృప వృక్షగిరి లతావితానముఖ తిర్యగ్జంతు సంతాననానా సకలభూతసంభవ జంగమ స్థావర సముదయ ప్రపంచంబంతయు మూర్తీభవించి మూర్తిమంతం బులై కొలువ నిండు కొల్వయి మహాశివుం డుండునంత న య్యవసర మ్మున ॥ ౯౧ ॥

—✻ తుంబురునారదులు సాంబమూర్తిసేవకు వచ్చుట. ✻—

క ॥ కైలాసశివుని సేవాం । దోలన మతితోడఁ దాను, దుంబు రుఁడుతప । శ్శీలోలాత్ముఁడు వచ్చుచు । హేలావన భూములందు, నెలమిఁ జెలంగన్ ॥ ౯౨ ॥ ఉ ॥ సారపటీరహీర సుర, సామజ శారద చంద్రచంద్రికా । నీరద కుందచందన వి,నిర్మల దేహ రుచు ల్వెలుంగఁ గా । నారదుఁ డేగుదెంచుచు మ,నంబున సంతస ముప్పతిల్లఁగాఁ। జే రెను శంభుమూర్తిపద, సేవనభ క్త్యనుర క్తశీలుఁడై॥ ౯౩॥ వ॥ ఇట్లమ్ము నివరుండు కైలాసగిరిప్రాంత నానావనాంతర కుసుమిత ఫలితచూతకే తకీ మల్లికావల్లికా మతల్లికాపరిమళ కుతూహలాగతసమంచితచంచరీ క నిరంకుశ ఝుంకారసంకుల సమంజస నికుంజ పుంజమ్ములునువంజుళక రంజ కుంజరాశన పలాశ కురంటక కోవిదార ఖర్జూర సింధువార మం దార పిచుమంద మాకంద కందరాల చందన కుందంబులును విశాలసాల తమాల తక్కోల సరళ పనస శమ్యాక మధూక క్రముక పున్నాగ భ ల్లాతకీసమీరణ తింత్రిణీకప్రియాళు బిల్వామలక మరువక కుటజజటిప్లక్ష కాంచన కదంబ లవంగ కరవీర జంబీర జంబూప్రముఖ మహీరుహ స మూహంబులును దదీయ మహనీయ శాఖాంతరాంతర కోకూయమా న శుకపిక శారికాద్యనేక శకుంతల నివహంబులును నితాంత విస్మయా క్రాంతస్వాంతుండై విలోకింపుచు॥ ౯౪॥ సీ॥ కెంపుల జడగుంపు, కేలఁగుండి



క మెడ మీఁదమహతినాఁగ, మెఱయువీణె । చేయికొక్క జపమాల,చే సింగినాదవు గోమూర్ధ్వపుండ్రంబు, గొప్పనాసలు । కలలేడి కడవస, కప్పడంబునుముంజి కట్టును మొలఁజంకఁ, గక్షపాల । పెరోగిరముబు వ్వ, బొట్టమిట్టునకారి వేరంబుమదిగల, వేల్పుఁదపసి ॥ ౯౭॥ వడిగ వె లిగొండవలెవచ్చె, నొడలుపెడలు । బుడుత వెన్నెల దుముకులు, కడలఁ గలయ । నెగయఁ బెనుగొండ రాచూలి, మగనియడుగు । దమ్ములకు మ్రొక్కు చిత్తము, త్నమ్ముతోడ॥ ౯౮॥ ఉ వచ్చినగాత్మజాహృదయ, వల్లభుఁడాత్మ సతీసమేతుఁడై । ముచ్చటలెచ్చనవ్వు మొగ, ముల్ దళుకొ త్త సుధామధూక్తులం । దిచ్చయెలర్ప నిండుకొలు, వెంతయు నొప్పగ నుండువేళవై । యచ్చరమౌని భక్తి విన,యంబుల వందన మాచరింపు చున్ ॥ ౯౯ ॥ గీ ॥ శరణు గౌరీముఖాబ్జభా, స్కరవికాస । శరణుకై లాస నిరుపమా, చలనివాస । శరణు మురహర సురగిరి, శరశరాస । శరణు సంపూర్ణ పూర్ణిమా, చంద్రహాస ॥ ౧౦౦ ॥ మ ॥ అని కీ ర్తింపఁగ నంజలిపుటసము, ద్యత్ఫాలభాగున్ మునిన్ । దనచెంతన్ వ సియింపఁ జన్నొసఁగి విం,తల్లేక నీవిందురాఁ । బని చింతించెదఁ గాల కూటవిష లో,కాదిష్టమేఁబాపి వ । చ్చిన యాపిమ్మట నీవు గాంచినది యే, చిత్రంబు లేదొగదా ॥ ౧౦౧ ॥

—✻ నారదుండు మోహినీదేవిచర్య శివునితో వచించుట. ✻—

సీ ॥ అనవిని వేలుపు, మునియును మున్నొన వాలుదాల్పుని గని, పాలసంద్ర । మఁ జనించినవి స,మును మీరుమెసవిట వచ్చిన వెనుక ధ, న్వంతరియును । వలిగిడ్డి నెలకూన, వలిచెట్లు చెందంతి వేలుపు నెలంత లు, వెల్లమావు । కౌస్తుభ రత్నంబు, కలుముల జవరాలు చింతామ ణియును జే, జేలబువ్వ ॥ ౧౦౨ ॥ దేలనే వెల్లమానులఁ, దెఱవపిండు। వె ల్లగుఱ్ఱము తెలినిగ్గు, వెల్లయేన్గు । నొడలిచూపుల యొఁడయండు, కడిమి

మెఱయఁ । గైకొనఁగఁజూచి కడుసుర, కక్కసులులేచి ॥ ౧౦౩ ॥ క ॥
కడువడి దుడుకుల బలువిడి । పెడపెడఁ గలహించిమించి, వేలుపు గమి
తోఁ । దొడిబడి యమృతపుఁ గలశము । నొడిసికొనన్ వెల్లనైను,రో
త్తములున్నన్ ॥ ౧౦౪ ॥ క ॥ సుధఁద్రావిరేని రకక్కసు । లధికమదో
ద్రేకులగుదు, రాజిని వీరిన్ । వధియింపఁ దరమె యని మధు । మథ
నుండూహించి యాత్మ, మాయాప్రౌఢిన్ ॥ ౧౦౫ ॥ చ ॥ కడలిని మీ
రినన్ దొగరు, కాంతులమానికమక్కనందు నేర్పడఁగయికొన్నమిన్న
బహు, భంగుల మోహమొనర్ప సుందరం । బడరఁగ నింతియయ్యె న
సు, రాదులచే నమృతంబు మెల్లగా । నొడిసికొనం దలంచి తన, యొ
ప్పులకుప్పతనంబు మెప్పనన్ ॥ ౧౦౬ ॥

—✻ మోహినీ వర్ణన. ✻—

సీ ॥ విమలేందు బింబమో, వికచారవిందమో తరుణినెమ్మోమే
రు, పఱుపరాదు। మగమీల ప్రాపులో, మదనుని తూపులో వెలఁదిచూ
పులెఱిఁగి, పలుకరాదు । మిసిమిపోన్ గిండులో, పసినిమ్మపండులో
యింతిచన్గవ ని, శ్చయింపరాదు । చంచరీకంబులో, శక్రనీలంబులో
శంపాంగికురులో భా, వింపరాదు ॥ ౧౦౭ ॥ కౌను గగనంబు గననే
ల, గలవోలేదో । పిఱుఁదు పులినంబో వలరాజు, పెండ్లి యరుగో ।
యనఁగ నఖిలాంగ శృంగార, మునఁ జెలంగు । సత్తరుణినెన్న బ్రహ్మ
కు, నలవిగాదు ॥ ౧౦౮ ॥ చ ॥ జలరుహగంధి కోకకుచ, సామజయా
న మదాళినీలకుం । తల హరిమధ్య సైకత ని,తం, బ తటిన్నిభగాత్రి
పూర్ణేందుమా । విలసితచంద్రబింబముఖి, విద్రుమరత్న సమాధరోష్ఠి
యయి । జ్వల నవపల్లవాంఘ్రి యయి, సంధిలె నావారి చంద్రశేఖరా॥
౧౦౯ ॥ సీ ॥ లలన పాదములు ప, ల్లవసంపదవహించుఁ బోఁతిజం
ఘికలుకా, హళుల నోఱయు। రమణియూరులు మేలి, రంభల నిరసించు

క్రొమనితంబముచక్రి, సమతనొందుఁ । గలకంఠినూగారు, కాలాహిఁగ
తిమీఱుఁ గలికి చన్నులు కంతు, కముల దొరయుఁ। చెలి యధరము బిం
బ, ఫలరీతిఁదగునన్ను మోము పున్నమ చంద్రుఁ, బోలుచుండు॥౧౧౦॥
గీ ॥ జోటి కురులింద్ర నీలంపు,సొగసు గాంచు। మగువ కెందోయి మగ
మీల, పొగరుమిగులు:।జాన వీనులు శ్రీలతో, జగడమాడుఁ। బడఁతినడ
లంచ కొదమల, బెడఁగుగేరు ॥ మరియును॥౧౧౧॥ బటువైన పాలిండ్లు,
బంగారు జిగి గుండ్లు పసినిమ్మ పండ్లు నై, భాసిలంగ । సొలపైననూ
గారు, పొలుపు చీమల బారు శైవాల రుచితీరు, చక్కదిద్ద । ఘనమైన
నెరిగొప్పు, కప్పు మెఱుఁగుగుప్పు ఘనకాంతి తతివిప్పు,కరణినొప్ప। మో
హనంబగుచూపు,మురువైన సుమచాపు తూపువాఁడిమిరూపు, నేపుమా
ప ॥ ౧౧౨ ॥ నసదుకౌనుమొగుల్ త్రోవ, నవలఁదోఁవఁ । దళుకుచె
క్కులు మెఱుఁగుట, ద్దముల సొగసు। దఱుమ నెమ్మోవి మరియమృ,తం
తంపుబావి । యైమె తనర్చంగ భువనమో, హనముగాఁగ ॥ ౧౧౩॥సీ॥
శృంగార రసమెల్ల, జిగిగుల్కు తొలకరి మెఱుఁగు ముద్దులగుమ్మ, కరణి
నొప్పు । నొప్పులకుప్పమై, యుప్పతిల్లగఁ గని యమరులందఱును దే,హ
ములుమఱచి । రసురులు నిదిమదీ, యాభివల్లభమరి నాయింతి నాబో
టి, నావధూటి । నావెలఁదుకమున్నె,నన్ననన్ మన్నించు నని మెదు
కోర్కి మో, హాంధవృత్తిఁ ॥ ౧౧౪ ॥ జేరఁ జెనకుచు వారల, చేత
నున్న । యమృత కలశంబు గొనియిచ్చె, నమరులకును । న ప్విలాసం
బు గనుఁగొన్న, యంతమాత్ర । నోరువఁదరంబె మీయట్టి,వారికైన ॥
౧౧౫॥ క ॥ మదనుని గెలిచితినని మీ । మదిలో స్థిరవృత్తిగలదు, మరి
మీరలునా । మదవతిని గనినచో మీ । హృదయము చలియింపకున్నె,
యేయెడలందున్ ॥ ౧౧౬ ॥ గీ ॥ సర్వ భువనాధికులు మీరు, సన్నుతిం
ప । నేమిచెప్పదుఁ దద్భామి,నీమహత్త్వ । మెంతవారలనైన నొ,క్కిం
తలోనె । వాలుఁజూపుల వలపించి, బేలుపఱచు॥ ౧౧౭ ॥ క ॥ ఆకులు

కు గుబ్బలానడ । లాకలికి యొయారమాంవ,యః పరిపాక। శ్రీకరము
గన్నవారలఁ । జేకాకొనరించుమదన, శిఖిశిఖ లవుడే ॥ ౧౧౮ ॥ క ॥
మారునిగెలిచితిరే మరి । దారు వనస్త్రీలనేలఁ, దగిలితిరిటుమీ । ధీరో
దారక్రియులె । వ్వారికిఁ దెల్లంబు లెంచ, వలెనేవానిన్ ॥ ౧౧౯ ॥ క ॥
మరిమీ సర్వజ్ఞత్వము । హరిమాయామోహినీను, హానూతనసుం। దర
బంధురాకృతిస్థితి।పరమశుభ స్ఫూర్తిఁగొన్నఁ,బ్రౌఢివహించున్॥౧౨౦॥
క ॥ భ్రమఁగొనక చిత్తసంభవు । సుమశరముల మోటుపఱచు, సురు
చిరదైత్యా । క్రమమైనయోగబలవం । తమునన్ జలనంబులేని,ధన్యాలె
తపసుల్ ॥ ౧౨౧ ॥ సీ ॥ కన్నులుకల్వలు, గళముచిందము తేనె పలుకు
లు పొక్కిలి, కొలఁకునుదురు । చంద్రఖండముమోము, జలజాతముమ్మృ
ణాళ ములుచేతు లిసుముది, బ్బలుపిఱుందు । లారుచీమలబారు, మీరు
సింగిణివిండ్లు కనుబొమలద్దము, ల్గండతలము । లనఁటులునుదొడ, అ
లరుగుత్తులుగుబ్బ కవమరుతూపుల, గములుచూపు ॥ ౧౨౨ ॥ లధరమ
గు కెంపువెన్నెల, హాసకిసల । యములు పదములునువళిత్రి, యములు
తరగ । లురదములు కుందములుమేను, మెరుగునాస। సంపఁగినఖంబు
లుడులుశ్రీ, శ్రవణయుగము॥ ౧౨౩ ॥ సీ ॥ జ్ఞానదీపకులైన, గనలేరు
నిబిడాంధ కారమా నలివేణి, కచముఁజూచి । వైరాగ్యులుసుదృఢ,ప్ర
తులు గాసేరరు గగనమా హరిమధ్య, కౌనుగాంచి । గుట్టుచేపట్టిలో,
కులకుండయాకరి సంబగుదానిచ,న్గవసునరసి । తరిమైనమోహాబ్ధి, ద
రిగనగానవం తఁబగు నింతిసొం, దర్యజలధి ॥ ౧౨౪ ॥ మగ్నమానసదు
గఁమ,మతులనెప్రసు । నఖిలలావణ్య శృంగారి మై, నటించు । నఁబు
జానన దృగ్గోచ,రఁబుగలుగఁ । గూడెనేసియు భువనాధి,కులకునైన ॥
౧౨౫ ॥ సీ ॥ చూపుతెంపెలగుమి, పాపుగల్గుటఁజేసి కన్నులు పుండ
రీ,కంబులయ్యెఁ । జిలునవ్వ వెన్నెలల్,చెంగలించుటఁజేసి నెమ్మోము
చంద్రుఁడై,నివ్వటిల్లె । హదిమధ్యసీమయం,దలరియొప్పుటఁజేసి చన్నులు



కొండలై,చెన్నుమెఱసె । శైవాలరుచినారు,శ్రీవహించుటఁజేసి పొక్కి
లికొలఁకుమై,పొల్పెసంగె ॥ ౧౨౬ ॥ పలుకు తేనియలీనెడు, ప్రాభవము
న । నధరబింబంబు చక్కెర,మైతనర్చె । యౌవన వసంత రతిగల్గి,
యమరుకతనఁ । గరపదంబులఁ జిగురులా,కాంత కెనసె॥౧౨౭॥

—❋మోహిని మాయచే దేవాసురులచే నమృతకలశంబుగొనుట.❋—

సీ ॥ అమృతంబుమీకునే,నందరికిని సమం బుగఁబంచి పెట్టెదఁ,బో
రుమాన్పి। యొనరఁబ జ్జిగఁగూరు,చుండుఁడి దేవదా నవులార యని త
న,నవ్వుముద్దు । పలుకులఁ గులుకులఁ,గలశంబుచేకొని కలికివా ల్చూ
పుల, నలరువిలుతు । తూపులదనుజుల,రూపులు ద్రెవ్వంగ భ్రమయించి
సురలకుఁ,బ్రమదమెసఁగ ॥ ౧౨౮ ॥ నొసఁగ హరిమాయఁజూచియు,
నొకఁడు తెలియ । వశముగాకుండి రసురులు,వాసవాదు । లప్పు డలివే
ణిజిగినొప్పు,కప్పుగొప్పు । చొప్పుగొని భ్రమలఁగొనరె, మెప్పుగాదె ॥
౧౨౯॥ మ ॥ అమరన్ గమ్మని తావిగప్పుకొనుమే,నందంపు దళ్కున్ మె
ఱు । గులముంపన్ జిగిచూపులన్ మరునిము, లుక్కల్ నాట డెందంబు
లన్ । ఘులుఘల్లంచును గప్పిగుబ్బకవగు,లక్కన్ వచ్చు నమ్మోహినీ । జల
జాక్షిన్ గనినన్ భ్రమల్గవియవే,సన్యాసికైనన్ దుదిన్ ॥ ౧౩౦ ॥ సీ ॥
గొప్పలొపిఱుఁదుల,యొప్పుగన్గొనియొక్కఁ డిసుముదిబ్బలటంచు, నెక్కఁ
దలఁచు । తళుకుచెక్కులతళ, త్తళలు గాంచి యొకండు నద్దంబులనినీడ,
లరఁజూచుఁ । గులుకుసిబ్బెపుగబ్బి,గుబ్బలుకనుఁగొని చేబంతులని ప
ట్టఁ,జేరునొకఁడు । వాలుకీల్జడనల్పు,వగగాంచి యొక్కండు తాఁచు
పామనిభీతిఁ,దలఁకునొకఁడు ॥ ౧౩౧ ॥ కెంపుకెమ్మోవి గనుఁగొని,సొం
పుమిగుల । దొండపండని కఱవంగఁ, దొడఁగులేచి । విష్ణుమాయాప్ర
మోషదు,ర్వృత్తికతన। నమృతరసమాన మఱచిరి,ట్లమరవరులు॥౧౩౨॥

సీ॥ హరిమధ్యచిత్రపుహరమట్లుపరిగొని దివిజారి గజమదో, ద్రేకముడి
పె। ఘననీలకచకాంతి,గదిసి రాక్షసచక్ర ములతమః పటలిని, ముంచి
వైచె। గజయానగతులున,గ్గజపురకటిసులహ్యా ప్తమలాకరంబుల,
గలఁగఁజేసె। మానినీముఖ చంద్ర, మందహాసద్యుతి దితిజమనోంబుజ,
స్థితులఁ దెలిపె॥ ౧౩౩ ॥ మందపరచెను నిర్జర, బృందమతుల। మతుల
నమృతంబు గ్రోలనెమ్మతులఁబోదలు। తరిని చిత్తరి యుధరామ్మ, యం
బుమీఁది। యాస పొలదిండులకుఁగల్గి,యమరుకతన॥ ౧౩౪ ॥ సీ॥ క
న్నులకలికిహావ్యంకడు కౌఁగిలింపంగఁ గోరునాకులుకుల,గుమ్మగబ్బి।
గుబ్బలు బిగఁబట్టఁ,గోరునొక్కఁడుబల్లి ఁబోవనీకాగియప్పాలఁతిఁకోలఁ
కు। షొక్కిలిచాలనం,బునకొకఁడు గడంగు ముందుగా నొక్కఁడా,
ముదితముద్దు। చెక్కులుగీటంగ, నిక్కినొక్కండాశతోఁ బడిపడిపో
క, ముడిసడల్పఁ॥ ౧౩౫ ॥ దివురునిబ్బంగి దనుజులు,ధృతులుదూలఁగి।
యున్నచోనుండ కందఱు, కన్నిగతులఁ। ద్రిమ్మరిగఁజేసెనప్పడా, యె
మ్మెలాడి। మరులుకొల్పుచుఁ దనమాయ,మతముకతన॥ ౧౩౬ ॥ ఉ॥
కమ్మలతళుకు మెట్టియల,కళుకు మృగీమద సౌరభంబులన్। ఘుమ్మనుమో
ము బెళుకు వగ,గులుకు నొయారపు కులుకులాడియా। యెమ్మెలు చిత్త
సంభవుప,కింపొనరింపఁగ సొంకుపొళ్ళుగాఁ। గొమ్మ విదుర్చుచో మి
గుల,గోరిక లీరికలైతనర్పవే॥౧౩౭॥

—* దేవాసురులకు మోహిని యమృతంబు వడ్డింపఁ బూనుట.*—

సీ॥ గీర్వాణులను బూర్వ,గీర్వాణులనునిట్లు పఙ్క్తిగాఁగూర్చుండఁ,బని
చినడుమ। ఘనమైన వడ్డన, కత్తైయె కుడుకల తోనుదా వడ్డింపఁ,బూ
నినట్లు। సుర సంఘముల వంకఁ, దిరిగి సుధాధరా ధరసుధ నీను త,
త్తరమునందుఁ। జారుపయ్యెద కొంగు,చక్కగా సవరించు కొనుసం



తలో నీటు, గులుకు తళుకు॥ ౧౩౮ ॥ గుబ్బల మెఱుంగు గన్నుల, గప్ప
కొనిన। నఖిల మగువారు మోహాంధు, లగుట యరుదె। యట్టి వగలా
డి చెయ్వెల్ల, నమరఁగనిన। మీకు మిమ్ము నెఱుంగరు, మేలిమాట॥౧౩౯॥
ఉ॥ కన్నులు నిద్రదేరఁ బలు, గాటుల మోవి చలింపఁ జన్నులన్। గ్రొ
న్నెల వంక లీననెరి, గొప్పునఁ జుట్టిన పూలు వ్రాలఁగా। నెన్నడురున్
జెమర్ప నెద, నీటగు గంధము చిట్లనిట్టులి। కన్నియతో రమించు వ
గ, గానని వానికి జన్మ మేటికిన్ ॥ ౧౪౦ ॥ క॥ అనుచిట్లువ్విళు లూరెడి।
మనమునఁ దలచుచును మోహ, మగ్నాస్వితులై। సనకసనందులుమొ
దలగు। మునిజనముల్ బ్రమయునట్లు, ముద్దియ చెలఁగెన్ ॥ ౧౪౧ ॥

నారదుండు శివునితో మోహినిం జూడ నీవును
భ్రమయుదు వని రోస మెక్కించుట.

మ॥ చెలిమొయ్యారపు గబ్బి గుబ్బకవఁ,ద్రింపంగఁ గన్నం
తనే। విలుబట్టేదది కల్లలేంబలికెదన్, వేయేల సమ్మోహినీ। లలనా
రత్నము వాలుకీలు జడలీ, లానందమున్ గన్ననీ। విలు నారిన్ విడఁజూ
తు వత్తఱిఁగడు, స్వభ్రాంతిచేనీశ్వరా॥౧౪౨॥ క॥అనవుడు నేమేమిముని।
యనుమాయింకొకపరియని, హరుడు నుడువఁగా। వినిమునిపల్కెను
గ్రమ్మఱ। మును చెప్పినయట్లై తేట, ముగట్లనుచున్॥ ౧౪౩ ॥ మ॥ బ
లుగట్టున్ నిరసించుగట్టిదగుగు,బ్బల్ గుల్కు నీలాహినై। వెలయున్ వె
న్నున వాలుకీలుజడయు,వ్వీక్షింపఁగాఁజూచినీ। విలుబట్టన్ మదినెంచ
వామరియునున్, వేయేల పల్కంగనా। నెలఁతన్ గూడెడు కోర్కితోవి
డుతువా,నీవింటినారిన్ దుదన్ ॥ ౧౪౪ ॥ ॥ క ॥ అనిన్వనియోగ్యము
గాముని। కనఁబడఁదాఁబల్కి కోప,కలితుండగునో। మనమున శివుఁ
డనుకొనితన। మనమున మరుపొదవెమాట,మాటలవరుసన్ ॥ ౧౪౫॥

చ॥ అనిమరి నారదుండు త్రిపు,రాంతకసే నిటులంటినంచుమీ । మన
మునఁ గోపగించకుఁడు,మానుఁడు మేమును సర్వమైనయా । వనజభవా
దిదేవతలు, వైష్ణవమాయనుజిక్కి యత్తఱిన్ । గనుఁగొన నేరనైతిమి
జ,గద్ధిత ధైర్యవివేకసారముల్ ॥ ౧౪౬ ॥ క॥ అనునపుడు గౌరి చిఱు
న । వ్వునఁ దనుఁజూడంగనాశి,వుఁడుసన్నము గాఁ । గినుకమదిఁ బొడ
మ నారద । మునికనిమెన్ బ్రమథులకును,ముంగోపముగన్॥ ౧౪౭॥
క॥ నన్నుండి నిపుణుఁడా తం । డెన్నికనేఁజక్రమీయ,నిలఁజక్రియనన్।
టన్నిధిగఁ బేరుగాంచెను। నన్నాబ్రిమయించు నతఁడు,నారీమణివై॥
౧౪౮ ॥ క॥ భువనంబుల మోహింపన్ । భువన జనయనావిలాస,
భూరిక్రియవాఁ । డవుఁగాక యేమి నన్నున్ । భువనాధికుబ్రిమయఁ
జేయఁ,బూనంగలఁడే ॥ ౧౪౯ ॥ క॥ ఎఱుఁగక చులుకగ నాడెద। వ
ఱిమఱిఁనినుఁబట్టికోప, మాగితినన్ఘ । కర కోపులగుచుఁ బ్రమథులు ।
కటకటఁగనుఁ గవల కెంపు,గడలుకొనంగన్॥ ౧౫౦ ॥ చ॥ గిటగిట పం
డ్లుగీటుచును,గ్రిక్కిరియన్ మును చుట్టుముట్టియున్ । బెటపెటలైన ప
లుకులను,భీషణభంగులఁ బేలి యుగ్రునిన్ । దటవటలాడెనే యెదురు,
తన్ను నెఱుంగకపోవనీకుఁడె । ప్పటివలె పేగవేగదిసి, పట్టుఁడు బా
సకటారిబాపనిన్॥ ౧౫౧ ॥ సు॥ హరునిన్ నింద యొనర్పవచ్చితివె నీ,
యాఖ్యాతములౌనకీ । శ్వరుమాహాత్మ్య మెఱుంగనేరవిటః,ల్వన్వద్దు
లేలెమ్ము యి । త్తరిసీవట్టి ప్రతిష్ఠలున్ సలుపుచా,ల్బెబ్బులం చిట్టులం ।
దఱుగుంపుల్ గొనియాసురర్షిబహుబా,ధల్పెట్టగాఁ దొట్టినన్॥౧౫౨॥
క॥ వారలఁ గనుసన్నలచే । వారించుచుఁ జిత్తజారి,వల నెఱుఁగఁడు
డు । రవ్వరమగు ముళ్ళమాటల । కారణ కల్యాణుఁ డితఁడు,కల జగ
ములలోన్ ॥ ౧౫౩ ॥ క॥ కలహముని పలుకుమాకున్ । కలఁకయువి
స్మయముకొతు,కంబొనరించెన్ । గలగొని దానికిఁ దగుక్రియ । కల
దొక్కటి యనుచుఁ బ్రమథ,గణములతోడన్ ॥ ౧౫౪ ॥ క॥ మీకేలయి



తేసతోన । వైకుంఠుని మాయయనెడి,వలఁజిక్కనినా । దాక్షార్హ్యము
రయఁ దలఁచుట । యే కేవలము త్తరముగు,నీతసికిపుడున్ ॥ ౧౫౫॥చ॥
అనిగిరిరాజనందన ముఖాం,బుజముఁజూచి సదాశివుండుతా। ననిమిషమా
నిపలికిన ప్రియం,బు వహింపని పలుకులన్ జనిం । చిన క్రుధ యింతఁ
డున్ గనఁగ,శ్రీహరి మోహినిరూపు గాంచినా । యనుపమ భోగశీల
భువ,నాధిక మేర్పడఁ జేయకుండినన్ ॥ ౧౫౬ ॥ గీ॥ శమము గానేర ది
ప్పుడు,చనఁగవలయు । ననిన మందహాసంబుతో, నగతనూజ। భయ
ము భక్తియుఁదోపంగఁ,బ్రియము మృదువు । మధురమునుగులుకఁ బ
లికెన,మ్మానివినఁగ॥౧౫౭॥

—※పార్వతి శివునితో విష్ణుమాయ గెలుచుటనీకును నశక్యంబనుట.※—

చ॥ ఇటువలెసేమి యీపయన,మిప్పుడుమీ రఖిలేశమాయలన్।
బటువగు విష్ణువం చనెడి,పలుకులుసిద్ధము సుందరీక్రియా । కుటిలశిరో
జినైనహరి,గొబ్బునఁ జూచితిరేని మీకునౌ । కరటుఁ జపలత్వమైన త
రి,గౌరవ మెట్లగునో తలంపుఁడీ ॥ ౧౫౮ ॥ క॥ నరులకు మునులధికులు
ముని । వరులకు సురలధిక లమర,వర్గమ్ములకున్ । బరమేష్ఠి యధికుఁ
డతనికి । హరియధికుం డతనికీవె,యధికుఁడ వెందున్॥౧౫౯॥ క॥ మా
యాధినధికుండే । చాయల హరి యెట్టివారిఁ,జలముఘటింపన్ । జే
యువిధంబుల బ్రమయన్ । జేయుటనిజ మరసిచూడ,సిద్ధముగాఁగన్ ॥
౧౫౯ ॥ క॥ హరి నరరూపున నధికుల । సురపతిసిన్ బ్రహ్మనతని,సూ
నుండగునీ। సురమునిముఖ్యుల మాయా । పరతన్ గిడ్పలచేఁ దెలియఁ,
బలికెదవినుమా ॥ ౧౬౧ ॥ సీ॥ గోవత్స గోపాల,కుల బాలకులడాప
నెఱిఁగిబ్రహ్మను బ్రమ,యింపలేదె । ఆలగా పరులపై, జాలవాన గురి
యు నింద్రునిమిగులభ్ర,మింపలేదె । బహువధూజనభోగ, భాగియై

ట్లాకొయను నీనారదుని భ్రమ, యింపలేదె । నీటిలోపల బైట, నిలిచిన
ట్లుగఁబోఁప నెనసియక్రూరు భ్రమింపలేదె ॥ ౧౬౨ ॥ మానవాకృతివ
హించి, మానునప్పు । డెపుడు వైకుంఠవాసుఁడై, యెలమినుండు। హ
రి మహామహు మాయమీ, రరయఁబోవ । నెంచ నేటికి భ్రమయించు,
నెంతవింత ॥ ౧౬౩ ॥ చ ॥ ఘలుఘలు ఘల్లనన్ హరిజ, గత్పరి మోహన
మోహినీసతీ । కలితపు రూపుదాల్పనెదఁ, గాంచి భ్రమంగొన నవ్వఁ
జాటుమీ । వలసినయట్లు చేయఁడిక, వల్దన నేల ననంగ నవ్వుచున్ । ల
లన మునీంద్రుఁడాడుగతి, నన్నిటులాడెదు నీవునుండగన్ ॥ ౧౬౪ ॥

—(*) పార్వతిమాటవినక శివుండు మోహినిమాయం గెలువ సపరివారుండై వెడలుట. (*)—

చ ॥ అనిశము మిమ్ముఁబోలుతర, లాత్ములఁగూడుట లేనదెల్లలో ।
క నటనకింతె మన్మథవి, కారపు పెన్ భ్రమనొటగాదున । న్వినుముమదా
త్మ బ్రహ్మమయ, నిర్మలమేక మొకండు విశ్వమె । ల్లను బరిపూర్ణచిన్మ
యవి, లాసగతిన్ జెలువొందుచుండుదున్ ॥ ౧౬౫ ॥ చ ॥ కులుకుమిటా
రిగుబ్బి చను, గుబ్బల మోహన భామినీక్రమం । బలవడు విష్ణురూప మ
ర,యన్ జననెంచితి వేడ్క నీమదిన్ । దలపుగునేని కామిని ము, దంబున
నీవును గూడరమ్ము పై । వలయునటంచుఁ బైనముద్ధ్రి, వం బొనరించె
ను సమ్మతంబుగన్ ॥ ౧౬౬ ॥ ఉ ॥ అప్పుడు కొల్వువారలును, హాశివు
చిత్తమెఱింగి తారుచున్ । మెప్పుగఁ బైన సంగతులు, మేకొన సంభ్రమ
చిత్తవృత్తులన్ । దప్పక సర్వసన్నహనత, త్వరతన్ గిరిధన్వ వెంబడిన్ ।
నెప్పరులై వెసంజనిర, నేక విధంబుల గుంపులేర్పడన్ ॥ ౧౬౭ ॥ అంత ॥
ఉ ॥ మానిత తప్తకాంచనస, మానతను ద్యుతితోడఁగూడియున్ । బూని
వెలుంగు జిల్గు పనిఁ, బూన్చిన బంగరుపట్టు పల్లమున్ । జీనము సర్వశో



భనవి, శేషముగాఁదగు కొక్కునెక్కి యు। య్యేనుఁగుమోము దేవరర,
హిన్ జనుదెంచెను బొజ్జమిఱ్ఱునన్ ॥ ౧౬౮ ॥ మ ॥ తలలాఱింటషడం
గ వేద నిచయా, ర్థప్రక్రియల్ గూడని । ర్మలగాథావిధ బోధన ల్వెల
యఁగా, మాయూరికావాహనో । జ్జ్వలశక్తిన్ వలకేలశక్తిగొని దే,
వశ్రేణితో వచ్చెనా । బలభిత్సైన్య పతీశ్వరేశ్వరుల కా, ప్తప్రాప్తసం
భాషుఁడై ॥ ౧౬౯ ॥ గీ ॥ వీరభద్రుండు నిజభటు, ల్వెనవేల । విభులు
చనుదేర నెంతయు, వేడ్కమెఱసి । శివుఁడు వెడలెడు సమయసం, స్థితి
దలంచి । సర్వమంగళ తానుద, త్సమయమందు ॥ ౧౭౦ ॥ సీ ॥ పతకం
బుముక్కెర, బటువైన చుట్టుంగ రములు కంకణములు, రావిరేక । లప
రంజికమ్మలు, నలరు పాపటబొట్టు తీగెబుగడలు చంద్రికలుసంది । కడి
యంబు లురువైన, గంటల మొలనూలు గొడసరములు ముం, గామురము
లు । బవిరెలు పిల్లాండ్లు, బంగారు మెట్టియల్ వీరముద్రికలును, వి ద్రు
మంపుఁ ॥ ౧౭౧ ॥ జేకటులు రత్నచిత్రిత, శ్రీదనర్ప । గంధకస్తూరి వా
సన, ల్ఘుమ్మనంగఁ । బట్టు పీతాంబరము గట్టి, గట్టుపట్టి । సర్వమంగళ
రాఁగూడి, శంభుఁడపుడు॥ ౧౭౨ ॥ సీ ॥ భసితాంగరాగసం, పదదేహ
ధళధళ ద్యుతులతోఁ బెనఁగొని, దుముకులాడఁ । గంఠనీలిమ మొల్కఁ, గట్టి
న గజచర్మ పరిధానకాంతిని, బలిసిమలయఁ । జిఱుతసారల వన్నె, చేల
భూషణ శేష ఫణశిరోమణి ఘృణి, ప్రతతి నొరయఁ । గాలిపెండెము
బొమ్మ, మేలిమి డాలు లలాటలోచనదీప్తి, నీటుఁజూప॥ ౧౭౩ ॥ మౌళిచం
ద్రాంశువులు జటా, మండలాగ్ర । దివ్య గంగా తరంగలఁ, దేలియాడఁ।
గరధృత పినాక డమరుక, పరశు శూల । ముద్గర ముఖాయుధంబులు,
మురువెలర్ప ॥ ౧౭౪ ॥ సీ ॥ తతసమున్నత తనూ, ధావళ్య ములతోడఁ
గమనీయ రుచిరశృం, గములతోడ । పంచాననవిహార, సంచితస్థితితోడ
నతులిత పదచిత్ర, గతులతోడ । వర గోపురాంబరా, వరణ వైఖరితో
డ సుమనోవితానవి, స్ఫూర్తితోడ । సంతాన పుష్పమం, జరుల సంప

దతోడ ఘోరిపత్కుస్త్రవ,స్ఫురణతోడ॥ ౧౭౫ ॥ మిగుల నడతెంచు కై లాస,నగమనంగఁ । దనరి పదహతిఁ ద్రవ్వుచు,ధరణితలము। మొగము వంచుచు భీకర,ముగను రంకె । వైచి గుప్పించు నందికే,శ్వరుని నెక్కి॥ ౧౭౬ ॥ శా ॥ వెన్నుండీయెడఁజేయు మాయల మరుల్,విశ్వేశునిన్ జేర కుం । డన్నేర్పొప్పఁగఁ బ్రోవనోకరుఁడ నిరూ,ఢప్రక్రియన్ నేనయో। రన్నా చాలుదు మీర లేలయనుచీ,రాలాపము ల్మీఱఁగా। సన్నాహంబునఁ గొల్చిరాఁగఁ బ్రమథుల్,సర్వజ్ఞుఁ డానందుఁడై॥ ౧౭౭ ॥ మ ॥ విభవం బొప్పఁగ నృత్తగీత కలనా,విస్ఫూర్తిఁ జే దేవతా । ప్రభుకన్యల్ సనుదే ర మంగలనిజ,ప్రస్థాన భేరీ మహా । రభసంబై శివదుందుభు ల్మొఱయ హో, రాళంబుగా దేవది । గ్విభు సంస్తవ్యత రాత్మ చర్య కథనా, వి ఖ్యాత లీలారతిన్ ॥ ౧౭౮ ॥ గీ ॥ వెడలి కక్ష్యాంతరముల న,వ్వేళము క్తి । మండపంబుల కడనుండి,మహితవిభవ। మెసఁగఁ జనుచుండి సా లోక్య,లెల్ల ఖచర । వాసులప్పుడు నేత్రోత్స,వముగఁజూడ॥ ౧౭౯॥ సీ॥ గొప్పలై మిన్నందు,చప్పరంబులుగల తన్ముక్తిమంటప,స్థలులనుండి। శృం గాగ్రసీమల,శృంగార విహరణ శ్రీసమాకృతినున్న,చేడెలెల్ల । కటకం తు గమనసం,గతులన్ని వీనుల విందుగావిని తమ, డెందములను । ఇ దియేమిపని శివుం,డీవేళ దలకొన్న కార్యంబు మిగుల వెం,గలితనంబు ॥ ౧౮౦ ॥ గాక పదివేస ములమాయ,కానిమాయ । జోటిమేటితనము జూటి,పాటిరూఢి । గాదు పగవాఁడు వెడవిలు,కాడువాని । సూను డనుసూఁడు దీర్చుఁబో,సూడు నేడు॥ ౧౮౧ ॥ మ ॥ అనవించున్ శివుఁ డంచిత ప్రకటమా,యారూపశృం గారిణీ । ఘనలీలాకృతిఁ బూడఁగాను దికి వే,డ్కల్వాల రెట్టింపనా । కనకాగార విచిత్రగోపురసమ, గ్రవ్య గ్రిరథ్యాదులె । ల్లను దోడ్తో నయమందుడై గడచి హో, లా చిత్ర పద్మంబునన్ ॥ ౧౮౨ ॥ మ ॥ అహిరా డ్భూషణుఁ డార్యకాత్మ న గశృం,గాభ్రంకషంబౌ నభో । లహరింగాంగ సరిజ్ఝరీక్రమ విలో,



లచ్ఛాఖి శాఖాశిఖా । విహగానేక వినోదము ల్ప్రబమరున్,వీక్షింపఁ గాఁ బల్కుచున్ । బహుదంతి ద్యుతిగర్భ దుర్భరదరీ, భాగంబులన్ జూపుచున్ ॥ ౧౮౩ ॥ చ ॥ నయమొనరన్ బరాబరులొ,నర్పఁగ సిద్ధు లు వేత్రహస్తులై । ప్రియముదలిర్ప యక్షసుర, బృందములున్ దగనూ డి.గీఁడులున్ । రయమున వెంటరాఁగ ముని,రాజులు కిన్నర గుహ్యకా దులున్ । జయజయశబ్ద గుంభనలఁ, జాలభజింపఁగ నిండువేడుకన్॥

—(*) శివుండు భద్రవటంబున విడియుట. (*)—

సీ ॥ మురజవాదిత్ర గో,ముఖముఖ నాదముల్ మలసిన గిరిగు హా,ల్మొఱమొఱయ । వైడూర్యగోపుర,ద్వారము ల్వెలువడి బలువైన ప్రాకార,పఙ్క్తి గడచి । మెల్లన మగరాల,మెట్లపై వడినెక్కి తిన్న గా డిగ్గుచు,దివ్యమైన । నవరత్నమయ తోర,ణంబులు గలచక్కి దప్ప క చక్కని,దారినడచి ॥ ౧౮౪ ॥ కమ్మ విరివాసనలయొమ్ము,గమ్మినెమ్మి। తనువులకు హాయి యొనరింప,దామసింప। కరిగి విడియఁగ మదిగోరి, యప్పురారి । డంబు రహిమీరి భద్రవ,టంబుఁ జేరె॥ ౧౮౫ ॥

—(*) సూర్యాస్తమాన వర్ణన. (*)—

క ॥ ఆప్రొద్దచ్చట నుచిత । వ్యాపారక్రియలవిడిసి,రందఱుతమ కున్ । వైపైనలీలఁ బడమటఁ । జూపట్టెన్ మందరశ్మిఁ,జొప్పడి రవి యున్ ॥ ౧౮౬ ॥ మ ॥ పరమేశుం డిటులద్రినందనయు ది,క్పాలుర్ము ను ల్సిద్ధులున్ । సురలున్ సాధ్యులు కిన్నరు ల్ప్రమథుల, స్తోకప్రభన్ గొల్చితో । నరుదేరన్ జనుచుండి భద్రవట ర,మ్యస్థానుఁడై వేళకా । హరిదశ్వుండ పరాబ్ధిఁజేరె హరిరూ,పానంద సంధానుఁడై ॥ ౧౮౭ ॥ చ ॥ ఘనతరదీప్తితోఁ దనువి,కాసిని గా నొనరించు లోకలో । చనము పరాగయోగమున,సాంద్రతరారుణ కాంతినొందినం । గనుఁగొని ప

ద్రినీలఁ న,గ్రకటాన ఘూత్కారణంబు సేయుపో । లికిని దన సెమ్మెగం
బు ముకుళించెఁ జలించె రథాంగ సంఘముల్ ॥ ౧౮౯ ॥ చ ॥ సమయ
భటుఁడు పూర్వనగ,సానుతటంబను కొత్తళంబునన్ । బ్రిమదముమీర
నిల్చి యాల, పాపపుఁ జీకటి పోకు మూఁకపై । సమరవతి న్నిగుడ్చిన
వి,యన్మయమైన పిరంగి గుండునన్ । గమలహితుం డఖండగతి, గ్ర
క్కునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకినన్ ॥ ౧౯౦ ॥ మ ॥ క్షితిసర్వజ్ఞుఁడనంగఁ
బేరయినయా,శ్రీకంఠుఁ డార్యాసమ । న్వితుఁడై నీదగు మోహినీత్వ
మునఁగన్,వేంచేయుచున్నాఁడుపో । ద్గతి మీరల్ పురుషోత్తమాఖ్య ల
సిప,ల్కన్ బోవు నన్లైక్రియా।హతభానుం డపరాబ్ధిశాయిఁగనఁజే,
రంబోమె సన్మిత్రుఁడై॥ ౧౯౧ ॥ గీ ॥ మిత్రతేజంబు తనుగూర్చి,మెచ్చి
యపర । దిగ్వధూటికి బడబాగ్ని,తెల్వినొసఁగు । తాపితాచీర య
నఁగ న,త్యంతశోణ। కాంతి పడమటసంధ్యరా,గమువహించె॥ ౧౯౨॥
సీ ॥ పరధరాధరభృగు,ప్రాంతకాంతారైక దావపావక శిఖా,తతియ
నంగఁ । బతదంశుమత్ప్రభా,హతిసము ద్భూతాబ్ధి రత్నపుంజోజ్జ్వల,ర
శ్మియనఁగ । సారతరంగిణీ,సలిలపానోజ్జృంభి తౌర్వానలజ్వాల,కౌఘ
మనఁగఁ। బటు మహా నటజటా,పటలవిస్ఫుటశేష ఫణిఫణామణిగణ,ప్ర
భలనంగ ॥ ౧౯౩ ॥ యామినీ కామినీహృద,యానురాగ । ముగనుస
మయాను చరుఁడాగి,గగనచత్వ । రమునఁ గుంకుమరేఖల,కొమరు దీ
ర్చె । నమర ననఁదగె సంధ్యరా,గముల గములు ॥ ౧౯౪ ॥ గీ ॥ పం
తమునఁ దన్ను గెల్వనే,ర్పరియటంచుఁ । బూనివచ్చెడు గట్టువి, లాక
నికెదిరి । నిలిచె నోమరుఁడనఁగ ద,న్నీలదేహ । కఠిన కాంతుల వలె
నుజీ, కటులు బలిసె ॥ ౧౯౫ ॥ గీ ॥ భువనములకంట నలుముగాఁ,బూ
నివేడ్క । విన్నకంచము గదియనా,వేళసాంధ్య । రాగదీపము నిలు
పవి,చిత్రముగను । గాటుకయనంగ గటికచీ,కటులు పర్వె ॥ ౧౯౬ ॥
చ ॥ పరగ మరుండు పెన్దొగ తు,పాకిని బుప్పొడి మందు తేఁటిగుం ।



డురువుగ మిరఁగూరిచద,లోదవు గుంటగఁజేరి రుద్రుఁడన్ । హరిణము
నేయఁ గల్వవిరి,యందపు జానకి తాటఁగోపవ । హ్నిరవులుచన్ మి
ణుంగురుల,నీతి నభస్స్థలినిండెఁ దారకల్॥ ౧౯౭ ॥ గీ ॥ చెలఁగుచు ను
ద్ధతిన్ సమయ,సింహకిశోరము వేడ్కమీఱఁగా। నలగఁగనాటవీ విలసి,
తాంధతమః పటలీభకుంభని । దళనమొనర్చి నల్గడల,రాజిలఁగా వె
దఁజల్లినట్టియు । జ్జ్వలతర మౌక్తికావళుల, చందమునన్ బొడసూ
పెఁ దారకల్ ॥ ౧౯౮ ॥ మ ॥ ఆవటవృక్షసీమను స,మహాతలంబున
నిష్టగోష్ఠివి । ద్యావిభవప్రమోద మహి, తామిత వాక్ఫణితప్రసంగ
నా । నావిధరీతులన్ నిజమ,నఃప్రియ సంగతు లుల్లసిల్లగాఁ । గేవల
మైత్రితో సుఖము, గీల్కొనఁగా శయనించె శర్వుఁడున్॥౧౯౯॥

## —(*) చంద్రోదయవర్ణనము. (*)—

చ ॥ పరమ మునీంద్రులెల్లను ద,పఃక్రమ భూరి సమాధియోగ
ముల్ । పరిగొని యోగగానిదుర,పట్టక యుంకటనున్న దేవతల్। నిరు
పమభోగసంస్థితుల నె,క్కొనఁ దూర్పనుభాను పంచునా । పరసపు
బోనపుట్టికన, చంద్రుఁడుదోఁచె సుధామరీచియై॥ ౨౦౦ ॥ సీ ॥ గగనా
టవీతార,కా మృగంబులనేలఁ గొనవచ్చు సింగంపుఁ,గొదమయనఁగ। ఘ
నతరయామినీ,కామినీ కర్ణైక విలసితరత్నకుం,డలమనంగ । సకల శ
కుంతసం,చయ భాసుర చకోర కులతపో యోగస,త్ఫలమనంగఁ। బూ
ర్వాచలప్రాంత,భూమితలోజ్జ్వల న్మంజుప్రవాళని,కుంజమనఁగ॥ ౨౦౧॥
నలఘుతరదీప్తి మండలం,బతిశయిల్లఁ । దనరఁగోకీ నికాయంబు,తల్లడి
ల్లఁ । గుముద వనసంతతులు చాలఁ,గొమరుమిగులఁ । జంద్రుఁ డుద
యించెఁ గాంతిని,స్తంద్రుఁడగుచు ॥ ౨౦౨ ॥ క ॥ ఖరకర కిరణ స్ఫుర
ణన్ । బరితప్తం బైనజనము,పై వీవఁగసుం। దర రజనీకరమునఁదగు।
సురటియనన్ చంద్రుఁడలరె,చూపఱకిమ్మై॥ ౨౦౩ ॥ క ॥ ఇరులనిమొడు

శైవాలో । త్కరములఁ బెనగొనిన ధవళ,కరసారబిసాం । కుర వి భ్రమోజ్జ్వలామృత । సరసియనం గగనవీథి,చంద్రుండలరెన్ ॥ ౨౦౫॥ అట్టియెడ ॥

—(*) చంద్రాస్తమానవర్ణనము. (*)—

గీ ॥ అంధకవిరోధి చనఁ దమం,బడర బలిమిఁ । గలసితద్రాక్ష యుగ్రత,గల్గనోడి । యోహటించెనో యల్లుడం,చూహతోడ । పడఁ గఁబోయిన గతినిశా,పతియు గ్రుంకె ॥ ౨౦౬ ॥

—(*) ప్రభాతకాలవర్ణనము. (*)—

గీ ॥ చంద్రు నస్తమాన, సరణిని గైకొని, చక్కఁబోడిచివచ్చె, దిక్కులందుఁ । బక్షి కలకలంబు,బలుపయియప్పుడు । భవుని పయన మునకు,బటువుగాఁగ ॥ ౨౦౭ ॥ క ॥ రాతిరి గడచినయట్లు ప్ర । భాతంబై మిగుల నమర,పతి దిశబ్రహ్మం । బై తెల్విబొదల సూర్యుఁడు । దోతేరఁగ నంద రెలమి తో,మేల్కొనుచున్॥ ౨౦౮ ॥ క ॥ కాలోచిత కృత్యంబుల । హేలాగతి సల్పివచ్చి,యీశ్వరు మ్రోలన్ । లీలఁ జెలు వొంద నిలిచిరి । శ్రీవెలయఁగ సురలు మునులు,సిద్ధులనంగన్॥ ౨౦౯॥ క ॥ తరువాతి కథా క్రమమది । నిరుపమవా గ్విమలవృత్తి,సేర్పొప్పఁ గమా । కెఱిఁగింపుమనుచు నడిగినఁ । బరమో త్కర్షంబు గాఁగఁ, బ్రౌఢిదలిర్పన్ ॥ ౨౧౦ ॥ శా ॥ దేవబ్రాహ్మణ భక్తియుక్తి ఘన బు,ద్ధి ప్రాభవా కాంచన । గ్రావాధీశ్వర ధైర్యసార విలస,ద్గాంభీర్య పాథోనిధీ । శైవేయ ప్రతిమానశౌర్యతర దే,శాధీశ కోటీర ర । త్నావిర్భావ మహాప్రభాంఘ్రియుగ వి,ద్యాభోజ రాజేశ్వరా ॥ ౨౧౧ ॥ క ॥ విలసిత సద్గుణసాంద్రా। వెలుగోటి కుమారయాచ,విభుగర్భసుధా । జలరాశి పూర్ణచంద్రా । బలవద్రిపు గజమృగేంద్ర,భాగ్యసురేంద్రా ॥ ౨౧౨ ॥ం



మాలిని.

సవితృ సదృశతేజో,జాలసిత్యత్వశీలా । కవి వినుత చరిత్రా, గాఢ సౌందర్యగాత్రా । భువన భరిత కీర్తీ,పుణ్యసా ద్గుణ్యమూర్తీ! దివిజ తరుసమానా, దీన విద్వన్నిధానా ॥ ౨౧౩ ॥

గద్య.

ఇది శ్రీమ ద్దత్తాత్రేయ గురు చరణారవింద మకరందబిందు సం
దోహ నంది మాన సేందిందిర భద్రకాళీ వర ప్రసాదిత
కవితా చమత్కార కుమారయాచ నృప దత్త తిక్క
జ్వ నామాంతర భాసుర రోసనూరి లింగనా మా
త్య పౌత్ర గంగన మంత్రి పుత్ర కాశ్యప గోత్ర
పవిత్ర వజ్రకంకట విశంకటమతి వేంకటపతి
కవిప్రణీతంబైన విష్ణుమాయా విలాసం
బను శృంగార ప్రబంధంబు నందుఁ
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# శ్రీవిష్ణుమాయావిలాసము

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీరోసనూరి భూపతి। గౌరీశ దయానులబ్ధ,కామితఫలశృం।
గార వెలుగోటికుల బం । గారేచ నృపాలచంద్ర,గమన మృగేంద్రా ॥
౧॥ వ ॥ అవధరింపుము ॥ క ॥ దేవా జనమేజయ ధా । త్రీవల్లభ కర్ణా
ములకుఁ,దెందేపలుగా । శ్రీవాక్సుధారసము చూరఁ। గా వైశంపా
యనుండు, ఘనముగఁ బలికెన్ ॥ ౩ ॥ ఇట్లు ॥ సీ ॥ ప్రాచీదిశాభామ,
ఫాలభాగంబున దీపించు సిందూర,తిలకమనఁగ। దూరుపు కొండపై,
గైరికస్థలమున నైరావతము పెట్టు,నడుగనంగఁ । బూర్వసముద్రంబు,
పొంతసంభవమయ్యెఁ బొదలెడు పగడంపుఁ,బొదయనంగఁ । బరమే
శ్వరున కింద్రు,పంపున దేవతల్ గొనివచ్చు కెంపుల,గొడుగనంగ॥ ౪॥
సూర్యుఁ డుదయింప నిబ్భంగి,శూలినిత్య । కర్మములుదీర్చి పైనంపు,
టాతురమున । గౌరితోఁ గూడి ప్రమథసం, ఘములు సురలు । మౌ
నులును గూడి చనుదేర,మహిమమీర ॥ ౫ ॥ క ॥ అలబలముగాఁగఁ
దన్నున్ । గొలుచుచు వెనువెంట వేగఁ, గూడియు మునులున్ । గల
సురలు నడువ మరివా । రల మన్నించుచును వేడ్క, రంజిల్లంగన్ ॥
౬ ॥ క ॥ శ్రీ వైకుంఠ పురమునకుఁ । ద్రోవం జేకొనుచుఁ దగుని,రూఢి
ని గౌరీ। దేవి యొడగూడ నిపుణము । గా వృషభారూఢుఁడగుచు,
గమనోత్సుకతన్ ॥ ౭ ॥ గీ ॥ పొద్దుపొడుపున నవరత్న,భూరిరత్న ।
కాంతి కాంతంబుగాబహు,కళలఁ దనరి । మిక్కుటంబుగ మెఱయంగ,
దిక్కులెల్ల । నాత్మ కత్యంత హర్షమై,యనువు మెరయ ॥ ౮ ॥ మ ॥
అలకానాథు నిజాపణాదుల ననే, కాపూర్ణ వస్తుస్థితుల్ । కలితా



ట్టాలకవేశ్మ గోపుర సమ, గ్రశ్రీ సువర్ణోజ్జ్వలో । త్పల సౌగంధిక
రత్నచిత్ర కమల,ప్రాచుర్య కాసారసీ । మలు శృంగారవను ల్విమాన
ములుధా,మశ్రేణులెల్లన్ వడిన్ ॥ ౯ ॥ క ॥ గిరినందనకవ్వటతరు। వ
రసవిధ స్థలవిచిత్ర,వైఖరు లంతః । కరుణ తగఁజూపి చెప్పుచుఁ । గర
మొప్పవహింప వేడు,కన్ బోవంగన్ ॥ ౧౦ ॥ శా ॥ యక్షాధీశ్వరుఁ డి
ష్టసౌష్ఠవసము,ద్యద్భక్తితోఁ గానుకల్ । నిక్షేపంబులు మున్నుగాఁగ నె
దుటన్,నిండారఁగా నిల్పి ఫా । లాక్ష శ్రీపద పంకజంబులకు నెయ్యం
బొప్పఁగా మ్రొక్కినన్ । బక్షంబైన కృపాకటాక్షమున సం,భావించి
వీడ్కొల్పుచున్ ॥ ౧౧ ॥ గీ ॥ సరస కర్పూర కదళికా,ఖండచైత్ర । ర
థ వనోద్యాన ములవిచి,త్రములు సర్వ। మంగళాస్పదముగ సర్వ,మం
గళకేళిఁ । గించి పలుకుచు సకలేశుఁ,డంచితముగ ॥ ౧౨ ॥

— (*) శివుం డమరావతిం గనుట. (*) —

చ ॥ చనుచును ముందటన్ గనియె,సారసచక్ర సరోవరంబులన్।
ఘనఫల పుష్పపల్లవని,కాయ సురద్రు వనాళి వజ్ర కే । తన పరిఖాభి
రామమణి,ధామములన్ గమనీయ రత్నశో । భనబహు సౌధ యూథ
ముల,బంధుర సుందర మైతనర్పఁగన్ ॥ ౧౩ ॥ క ॥ గోపురమిట్టాల
మందర । గోపుర నవరత్నఖచిత,కుట్టిమవిభవ । శ్రీపరమౌ నమరావ
తి । నాపరమేశ్వరుఁడు చూచి,యతి కుతుకమునన్ ॥ ౧౪ ॥

—* నందనవన వర్ణనము. *—

క ॥ నందనవన కల్పద్రుమ । బృందంబుల నీడఁ జనుచుఁ, బ్రియ
మెనయన్ బా । లేందుధరుఁడు హిమగిరిరా । ణ్ణందనకిట్లనియెఁ బ్రియ
ము,నన్ హిత మొదవన్ ॥ ౧౫ ॥ ఉ ॥ చెంగలిచూపులన్ బ్రియము సె,
ప్పఁగ మెప్పగుచున్న తమ్మితూం । డ్లంగొని ముక్కులం గొఱికి, డగ్గ
రియిచ్చు ప్రియాంగనావళిన్ । బొంగుచుఁ గౌఁగిలించుచు వి,నోదము
మీ రమరాళ దంపతుల్ । గాంగ తరంగ డోలికలఁ గామిని యుయ్యెల

లూఁగుఁగంటివే ॥ ౨౮ ॥ ఉ ॥ చన్నులు చక్రవాకములు, సైకత భూతలము ల్పిఱుందులుక్ । గన్నులు గండుమీనులు ముఖంబులు నీరజ బృందము లుక్కురుల్ । చెన్నగు తేఁటిగుంపులు వళిత్రయ మూర్ములుగాఁగ జేజెరా । యన్నులొయారపుక్ సరసులై తగి యొప్పుట చూడు కోమలీ ॥ ౨౯ ॥ వ ॥ అనియిట్లు ముక్కంటి గట్టురాపట్టి వాల్గంటిమిన్న మిన్నగల దిట్టతనంబున తనముందటక్ బెట్టికొని పట్టు దప్పని పైనంబున కూఁకొని కొనియాడుచుండగు క్రేవలఁ గేవలంబయిన తావులుంగల త్రోవలఁ గాంపింపఁ బెంపైనకొమ్మల జొంపమ్ములందగు వనమ్ములమీరిన కీర శారికా మయూరకుల సమాకుల రావమ్ముల కిమ్మైన ఫలదళ కుసుమ విసర ఫలిత నానా లతావితాన నితాంత మాలతీ మాకంద బృంద కురువింద పిచుమంద జంబూ జంబీర నింబాశ్వత్థ కర్పూర కదళీ రసాల సాల తక్కోల తాల హింతాల వకుళ వంజుళ కురువక మరువక మన్మథ మధూక మంజుళ పుంజ రంజిత మధుసంతాన గురుతరాంతరానర్గళ మార్గంబుల హేరాళభారాళ హేలావిలాస బంధురమదసింధురంబులమాడ్కిక్ జనుచునను చుఁ బ్రియంబునసయంబున డెందంబున కానందంబు సందడింప నిందుమౌళితోడ వేడుక గులుకక్ బలుకు పలుకుల కప్రింపు పలుకులం దొలుకు తీపు దళుకొత్తు తేనియల్ గులుకరించ భాషించు కలభాషిణి మధురంబగు నరుణాధరం బారం దీరం బండి నిండు దొండపండనుకొని యొండొంటిక్ గూడుక తండతండంబులై చురుచురుక్కునక్ గరువతనంబునక్ రాఁగని రాగనిమగ్నంబగు నల్కచులకన నక్కన్నె రాచిలుకల పిలుకలఁజే విదిర్చి పేర్చిన చేర్చిన మోదంబు మదంబున నత్తరుణి తరుణ కర పంకజంబు లరుణ కిసలయంబులని మొసవ నుల్లంబులు పల్లవింప వడి గడలుకొనఁ దొడిబడ నాహారంబుల నాహారవాంఛలు పెనంగొన బెగ్గడిల్లకఁ బెల్లుగావచ్చు పిక నికరమ్ముల వికలభావమ్ములు ప్రియంబునఁ దెలియఁబలుకు ప్రియుని కులుకు పలుకుల



కుఁ గలకలనగు చంద్రముఖి ముఖ మండలంబు చంద్రోదయంబుగాఁ దలంచి కలంచిన మనంబుల ఘనంబుగ ముందుముందుగ విందు లారగింతుమను చందంబుల తెందేపలై ముద్వెంపు నవ్వులక్ మూఁగి పండు వెన్నెల బువ్వ కడుపులనిండ మెక్కం గలిగెనని దవ్వులనున్నవారి గవ్వలం బెట్టి క్రొవ్వరందిట్టి వేగంబు నివ్వటిల్ల రఁడని కోరిక లీరికలెత్తం బిల్చి డగ్గరక్ మేరమీరంజేరి వెంట నంటివచ్చు చకోరికల సారెకుంజూచు నమృగీవృశచూపుల దావుల కోపుల యోపికల్ గల్గి చెవులురిక్కించి నిక్కిచూచుచు భయభ్రాంతిచే దూటుదాటు లేడిగుంపులం గను వేడుక కూడిన జాడలం దలయెత్తు నయ్యాలివేణి కప్పుగుప్పు పెన్నెరిగొప్పు కొప్పున నెప్పుమరి మెప్పు చొప్పుప్పతిల్ల దిట్టపట్టంబుగాఁజుట్టిన కమ్మవాసనల విరుల సరులఁ గమ్ముకొని దళమ్మగు తావులక్ దావలంబయిన గుణంబుల గమకంబులుగాఁ దెలుపం బొలుపై గమ్మన నేతెంచు తెమ్మెర పిన్నవాని మన్నెతనమ్ము బురుణించి ఘనమ్మగు నెమ్మెలక్ గరుణించి యురువడించి ముదమ్ము బెరయ మదమ్ము నెరయ ఝుమ్మఝుమ్మనక్ గ్రిమ్మిగ్రిమ్మన నడతెంచు నెల తేఁటికులమ్ముల మొత్తమ్ము లమించు మించుల మించు నురుములతోడి మేఘమ్ములను చాపలమ్ముల యొమ్ముఁ బురులువిప్పినటించు నెమ్మిగములం గామ్ముకమ్ములం గాంచుచుఁ దత్తత్సరోవరంబుల వారిమీరి బిసకాండంబులం బారి సమరి ఖండించి చంచుపుటమ్ముల దిటంబుగా కబళించ గళవళించు జాలపదంబులు వీకం గూకలిడు తత్కలకలం బాలోకింపుచు ॥ ౩౦ ॥ ఉ ॥ తమ్ముల యిమ్ములం దనుగతమ్ముల నొమ్ములనున్న తేఁటిమొ । త్తమ్ముల ఝంఝుమక్ మొరలు, దాఁరొక్కని యక్కలహంసనాదముల్ । గమ్మగఁగమ్మ వాసనలు, గమ్మఁ దూటుచు వచ్చువాతపో । తమ్ముల సోకులందు గుమ్ము, దమ్ముల హాయని నేదదేరఁగక్ ॥ ౩౧ ॥ చ ॥ అటనట విశ్రమించుచు మహాతపమాతతమైననోర్చిచ । కటిగల నూగణమందు జన, కన్గొనిపల్కు వెల్ంది

రెంపుమి। కుక్కుటముగ దొడ్డతెల్లగల,కూరిమి రెక్కల పక్షినెక్కియొ। క్కుట గలయుంగ సుగ్రుడధి,కత్వరతన్ గమియింపుచున్ రహిన్॥ ౩౨ ॥

— * శివుండు పాలసముద్రముం గనుట. * —

సీ ॥ అటువలె వలిదిబ్బ, యల్లుండు వైకుంఠపురము చేరువగాఁ గఁ,బోవుచుండి । యెలమితోఁ దనకును,దలపువ్వు మొలవంగఁ జేసి ఘనజ్ఞుఁడై,చెన్నుమెఱసి । మినువాక మొదలగు, మేలైన యేఱుల గముల కు మొదలను,క్రమము గాంచి । పదినూరు కన్నుల,బాపెక్కియాడెడు చక్కని గనిసము,త్సాహమెనసి ॥ ౩౩ ॥ దబ్బి పూనిబ్బరపుడబ్బు,బొబ్బి మెకము । నుబ్బ సిబ్బెంపు వెలిమబ్బు, నబ్బురంబు । పసిడి బొజ్జయ్యన డకైన,పక్షినిక్క । గడలుద్రోయంగ గలుగుపా,లఁకడలిఁజూచి॥ ౩౪॥

—(*) శివుండు పార్వతితో క్షీరసముద్రాదిగత విశేషంబులు చూపి చెప్పుట. (*)—

సీ ॥ గౌరితో నిట్లను,కాంత యల్లదె కంటె యనతి దూరమున దు,గ్ధాంబురాశి । హరి యిల్లటపుటల్లుఁ,డమ్మేను దనకను కరణి నుబ్బె నౌనాగ,ఘనతరంగ । గణములు మిన్నందఁ,గనుపట్టె నాదండ వెలిదీవి గనుగొంటె,వేల్పులెల్లఁ । దన్ను సాధించంగ,వెన్న దేలిననది పెనుదిబ్బ వైచిన,ట్లొనరె చూడు ॥ ౩౫ ॥ కాంత కనుగొనుమట్టె చెం,గటను మెట్ట । తమ్మివలెను వైకుంఠపు,రమ్ము వెలసెఁ । గోటకొమ్మల తమ్మిరే,కులుగనమరి । యున్నవని చూపి మఱియున,య్యగ్రుఁడనియె ॥ ౩౬ ॥

సీ ॥ ఇందిందిరాలక,యిమ్మహా నగరంబు విభవంబు కలదెల్ల,వినుతి సేయ । నస్మదాదులకును,నాదిమ ఫణికిని కమల గర్భునకైన,క్రమము చిక్క । దిందిరా రమణుని,మందిర ద్వార సీమ కురాజవీథియో, మార్గమతివ । నారాయణుని పెద్ద,నగరి చేరువనదె మకరకేతనకాంతి,మలసి మిగిలె ॥ ౩౭ ॥ గెంటకున్నది రసదాడి,వింటివాని । ఇల్లు చూచితె ముందర,నిందువదన । శారికాకీర కలకంఠ,చంచరీక । మోహన బలంబు



లెల్లనీ,మోహరించి ॥ ౩౮ ॥ క ॥ ఉన్నట్టి చందమిప్పుడు । వెన్నుని పెను బ్రాపువలన,వెడ విలుతుఁడు బల్ । సన్నాహంబున నాపై । మున్నిటితన సూడుదీర్ప,మొనయుట దోఁచెన్ ॥ ౩౯ ॥ వ ॥ అని యిట్లు పలుకుచు ॥ మ ॥ రవిచంద్రాగ్ని విలోచన క్రమతశ్రీ,రంజిల్లగా నమ్మహా । శివుడయ్యార్యకు నేత్రపర్వముగ ల,క్ష్మీవల్లభోద్యత్పురో । త్సవ శృంగార కళావిలాసములు త,త్తద్వైఖరుల్ నందుసం । ము వినోదంబు లఁజూచి చెప్పుచును సం,తోషాతిరేకంబునన్ ॥ ౪౦ ॥

...* శివుండు విరజానదిం గాంచుట. *...

సీ ॥ మందార మాకంద,సుందర వనబృంద సీమ సుగంధముల్, ప్రేమఁబొలయు । శీతలచ్ఛాయల,శివుఁడును శివయును సర్వసుపర్వులు, సకల సిద్ధ । సాధ్యాదులును మును,లుపరివారముగాఁగ జనిచని ముందట,గనిరి వేడ్క । నమృతంపుఁ దరగల,నలరుచుఁ గెందమ్మి తళుకుల కెంపు చెంగలువ గములు ॥ ౪౧ ॥ దనరు నీలంపుఁ జేటిమొ,త్తముల బెరసి । కలిత కలహంస జలవిహం,గముల కలక । లార్భటుల్ గల్గి రత్నము,యప్రభాభి । రామ సోపానమై నవి,రజయనునది ॥ ౪౨ ॥ అలర మరియును నచ్చోన,స తరామ । శ్రీవిలాసంబులైన స,రోవరములు । తరువులై సర్వ గరుడగం,ధర్వ దివిజ । యక్షముని సేవ్య భవ్యమై,యతిశయిల్లె ॥ ౪౩ ॥ సీ ॥ అవిరళస్నాన సం,ధ్యాది క్రియాచార నిష్ఠావనీసురా,న్వితతటము । లతులిత భాగవ,తార్థ ప్రసంగవిస్ఫుట సుధీజనపచ,స్పందనములు । జలచర చక్రాంగ,సారంగ బకవిహంగమసంగతతరంగ,సముదయములు । ఫుల్లహల్లకసితాం,భోజకైరవచరచ్చంచరీకారవ,సంకులములు ॥ ౪౪ ॥ కలితవిద్రుమ సోపాన, విలసితములు । గరుడ గంధర్వ కిన్నర,ఖచర నికర । వినుతమానస కాసార,ఘనవిలాస । రుచిర విభవంబులగు తత్స,రోవరములు ॥ ౪౫ ॥ మ ॥ కమలాబ్జ స్ఫుటచక్ర ధారణమునన్,గాంభీర్య లీలాయుక్తిన్ । సుమన

స్తుత్య శివీముఖోన్నతజన,స్తోమాహీరా ద్వైభవ । క్రమయోర్ధన్ ధ
రణీసురాభినుత సౌ,కర్యాను భావంబునన్ । గమనీయంబగు శార్ఙ్గ
పాణి కరణిన్,గాసారము ల్చెల్వగాన్ ॥ ౪౬ ॥ గీ ॥ అట్టికాసార తీ
రమై,యలరు విరజ । మహిమ మాద్యంతమును సర్వ,మంగళయగు ।
గౌరికేర్పడఁ బల్కుచుఁ,గాలకంఠుఁ । డా సమీపాంతరము జేరు, నవ
సరమున ॥ ౪౭ ॥

—(*) నారదుండు శివునికంటె మున్న వైకుంఠంబునకరిగి హరిఁగనుట. (*)—

సీ ॥ అందనంతంబైన,హరిభక్తి పరులును బరమయోగీంద్రులు,
భాగవతులు । నతులితవినయవి,శ్రుతలీల చిత్తులై వేడ్కతో దినమున,
వ్విరజఁగ్రుంకి । సంధ్యాజపంబులు,సలుపుచుఁ దమమనో భీష్టంబు లీడేరఁ,
దుష్టివొదల । ననుపమమణిభూష, ణాంబరా డంబరులై విష్ణు సేవిం
ప,నలరుచుందు ॥ ౪౮ ॥ రటుల గావున నారదుం,డపుడువేగ । నవ్వ
నముదాటి మునుమున్న య,వ్విరజను । నిత్యకర్మంబు లొగిదీర్చి, నిష్ఠ
మెఱసి । హరిని సేవింప వైకుంఠ,పురముఁజొచ్చె॥ ౪౯ ॥ క ॥ కుడికే
ల మహతి కుడిమెడఁ । గడుసిడుకొని యెడమచేత, ఘనకుంచికనున్ ।
దోడిబడ విసరుచు వలయము । గడలుకొనన్ దిరిగి కుప్పి,గంతులు గొ
నుచున్ ॥ ౫౦ ॥ క ॥ హరికడకు నరిగె మున్నుగ । హరుఁడాత్మజా ము
లపొంత,కరిగియు విరజన్ । సరసుల నన్నిటఁ గలయన్ । దిరిగివలయు
విధులు తాను,దీరిచి యంతన్ ॥ ౫౧ ॥

—(*) శివుండు వైకుంఠనగరంబు సొచ్చుట. (*)—

శా ॥ శ్రీవిశ్వేశుఁ డనంతభూషణుఁడు గౌ,రీదేవితోఁగూడితా ।
నా వేళ న్విరజానదీ మహిమము,న్మెచ్చోట్ల సంధిల్లు త । ద్భీవిస్ఫూర్తిగా
విశేషసంగతుల న,ర్థిన్ గౌరికిన్ జెప్పుచున్ । దేవోత్తంసుఁడు విష్ణుదే
వుపురమున్,ధీయుక్తితోఁ జొచ్చియున్ ॥ ౫౨ ॥ క ॥ నవరత్న ఖచిత



కాంచన । భవనంబులు సేయ గరుడ,పావన కుముదా । త్మ విజయ జ
య కుముదాది । ప్రవరుల కిరవైన మంది,రములవి గనుచున్ ॥ ౫౩ ॥
క ॥ తోరణ బహులము లగుచును । దోరణములు వెలసిసర్వ,తోముఖ
భద్రా । గారముల నెరయు హరిపురి । గారవమునఁజొచ్చి చనుచు,
గారుడ రుచులన్ ॥ ౫౪ ॥ చ ॥ పరగు మణిప్రతానముల,బల్వగు కోట
లపెంపు రత్నసుం । దరతర గోపురంపుజిగి,దాల్చిన సౌధములున్నసౌం
పు త । త్పరమతి నొక్కటన్ దెలియఁ,బద్మదళాక్షు పురంబదెల్లఁదా।
నరయుచు హేమచిత్రభవ,నాంగణ సీమ లతిక్రమించుచున్ ॥ ౫౫ ॥
క ॥ హరిపెద్ద హజారముకడ । కరిగియువా హనముడిగ్గి,నభవునికట
మున్ । త్వరితగతి నారదుఁడు శుభ । కరమతి నటమున్నె వేగ,గమ
నస్ఫూర్తిన్॥ ౫౬ ॥ చ ॥ పరిఖలు కోటలున్ గడచి,బంటుల కావలివా
రి మీరి సుం । దర నవరత్నమందిరవి,తానములెల్ల నతిక్రమించిము ।
ప్పిరిగొను భక్తిఁ జక్రధరు,పెద్దహజారము చెంతజేరి శ్రీ । హరి కమ
లా సమేతుఁడయి,హాటకహర్మ్యము మీద వేడుకన్ ॥ ౫౭ ॥ గీ ॥ నృత్త
గీతవినోదము,ల్నెరయఁగనుచు । వినుచు నొకవంక నిందిర, వెలఁదిపిం
డు । రవ్వతనముల నురిగెము,ల్నివ్వటిల్ల । మీరి దుగడచ్చి యుత్తిక,బా
రయనుచు ॥ ౫౮ ॥ శా ॥ జూదంబాడఁగ నొక్కవంక కొలువై,సుజ్ఞా
నలోకక్రమ । ప్రాదుర్భావవిదుండు నుండఁగని తా, త్పర్యంబు సంధి
ల్లఁద । త్పాదాంభోజయుగాహవందనము,నర్పన్ నారదున్ జూచి
ల । క్ష్మీదేవీ ప్రియవల్లభుండు కరుణా,శ్రీదోపఁగా నిట్లనున్॥౫౯॥

—*నారదుండు విష్ణుతో శివుండాడిన హెచ్చుమాటలునుడువుట.*—

సీ ॥ కూర్చుండు నారద,గుణగణ్య త్రిభువన సంచార మాయాం
దుఁ,జాలభక్తి । గలవాఁడ వౌదుగా,గరళకంధరు సమ్ముఖమున కెన్నం
డైనఁ,గడగినీవు । పోయినయదిగల,దావేమి మాప్రసంగములందుఁ
గలవేని,కలిగినట్టి । గతులెల్ల దెలుపుమా,గౌరి మాయక్కనా యంద

లి దయయెట్టు,లనిన నపుడు ॥ ౬౦ ॥ దేవమౌని తదాజ్ఞను,స్థితిఁగూరు । చుండి బహుసన్నుతులుచేసి,పుండరీక । నయన కైలాస మునను౦డి,నయముమీర । వచ్చితిని నేను మీపద,ద్వయము గొలువ ॥ ౬౧ ॥ క॥ శంకరుఁడు సకలలోక శ్రీ । వంకరుఁ డఖిలంబు గొలువ,వైభవలీలన్ । బొంకముగ నిండు గొలువై । సంకీర్ణంబుగను నుండు,సమయమునందున్ ॥ ౬౨ ॥ సీ ॥ చని యయ్యుమామహే,శ్వరుల సందర్శించి యున్న శ్రీకంఠుఁడు,నన్నుఁజూచి । బిసరుహాక్షుఁడు సుధా,రస మనిమిషులకుఁ బెట్టిన విధమెట్లు,బట్టుగిట్టి । దనుజులు కలహింపఁ,జనకనివ్వెరపడి బలహీనులైయున్న,భంగియేమి । కతమున నయ్యెఁద,త్తక్కమ మెఱింగి నఁజెప్పు మనిననప్పరమేశ్వ,రునకు నేను॥ ౬౩ ॥ విన్నవింపంగఁ దలఁచి స,విస్తరముగఁ । దోయజాక్షుఁడు హరిముకుం,దుఁడు సమస్త । లోకమోహనుఁ డాసురా,నీకములకు । నమృతమీయంగ శ్రీరూప,మదిధరించె ॥ ౬౪ ॥ మ ॥ తన శృంగారముఁజూచి దానవులుచి,త్తభ్రాంతిఁ జెందంగనూ । తనసౌందర్య వయోవిలాస రతికాం,తారత్న మౌటన్ సుధా । శనులై యెల్ల సురల్ తదాకృతిగనన్,సర్వేశమీరైననున్ । న నవిల్కాని యుపద్రవంబులను నా,నాచిక్కులన్ బొందరే ॥ ౬౫ ॥ క॥ మీరెంతవారు హరిశ్రీ । గారశ్రీవిధముకన్ను,గవ కడ్డపడన్ । మారుని విరిగుబియలప । ల్మాగున్ మొత్తబడకుండు,మహిమ దనర్పన్ ॥ ౬౬ ॥ క ॥ అనవిని కోపము గదురఁగ। నను గినిసి సభన్ననుంద్రు,ణప్రాయతఁ జు । లకనినాఁడె వింటి రేమొని । వనితను హరిఁజూచివిరతి,వదలుదు న నుచున్ ॥ ౬౭ ॥ అని ॥ క ॥ ననవిల్తు గొంగపలుకన్ । మొనసిన చిఱునవ్వు గౌరి,ముఖపద్మమునన్ । గని శివుఁడును బ్రమథులతో । ననుఁజూపుచుఁ దనమహోగు,ణ ప్రకటముగాన్ ॥ ౬౮ ॥ మ ॥ అవిచారుండయినన్ విషాశనుని మా, యాభేద్య నత్యంతదు । ర్భవదూరున్ మరి మృత్యుసంహరుని బ,ల్పాపాపహున్ సర్వమా । భువనాతీతు నమేయు నీశ్వరు



జగ,త్పూర్ణున్ మహా దేవునిన్ । శివునిన్ జుల్కగనిట్లు వల్కిన సుర,ర్షిన్ శిక్ష సేయందగున్ ॥ ౬౯ ॥ మ ॥ అనినన్ భృంగి రిటాదులౌ ప్రమథులు,ద్యత్క్రోధులై వేగమే । ననుబట్టంగఁ గడంగునయ్యెడ ననూ,నంబైన కన్సన్నవా । రినివారించి హిమాచలంబునను గౌ,రీయుక్తుఁడై జాలఁ బ్రా । ర్థనగావించినఁ జక్రమిచ్చి జగద,ధ్యక్షత్వముం జేసియున్ ॥ ౭౦ ॥ ఉ ॥ మాయలు మంత్రము ల్సకల, మంత్రము లందుల తంత్రముల్ మహో । పాయము లస్త్రశస్త్రములు,పాటియు చూటియు నేర్పరించి దై । తేయుల సంహరింపఁ దగు,ధీయుతుఁ జేసితి నేని నాతఁడున్ । స్త్రీయయినన్ భ్రమింతునని,చెప్పెదవీవు వివేకసారమే॥ ౭౧ ॥ క ॥ నిను నెఱుఁగ వెదిరి నెఱుఁగవు । వినుమీ నీవగణమెల్ల, విధములఁ జెఱుతున్। జను లెఱుఁగ విష్ణుమాయా । వనితాత్వముఁజూచి విరతి,వలఁతిగనగుచున్ ॥ ౭౨ ॥ చ॥ పరువడి నష్ట నావిరతి,భావము నీవు ను సర్వమైనయీ । సురలు మునీంద్రులున్ దెలియఁ,జూచెద రెంతయు వింతగాఁగను । త్తరమిది నీవుపల్కనకుఁ,దక్కమికన్ వెడమాట లీవు ము । స్మైరుగక నాడుటన్ మరిస,హించితి మించగనాడకీవిఁకన్॥

—*హరిహరులకుఁ గలహంబుగల్గు మాటలు నారదుం డాడుట.*—

ఉ ॥ మంచిది మోహినీ యువతి, మాఘవుఁగమ్మను చూడవచ్చెదన్ । బంచశరుండు నన్ గెలుచు,భంగి యొనర్పుము వేగ పొమ్మనీ । వంచితలీలతో హరిమ,హాత్వ మెఱింగినవాఁడ వౌటచేఁ। గాంచెదనమ్మ మత్తరిజ,గద్విదితంబగుఁ దారతమ్యమున్ ॥ ౭౪ ॥ చ ॥ అరయక నీవునన్న భువ,నాధికుఁ జుల్కగ నాడితౌగదా । మరవక పొమ్ము నీపది,రమాపతి వేగమె మోహనాకృతి । స్థిర తరుణిన్ స్థితిన్ దగివి, శేషత నన్ బ్రమయించినన్ గదా । నిరుపమ సత్యశీలుఁడవు;నీవు మునీశ్వర వేయునేటికిన్ ॥ ౭౫ ॥

—*శివుండు వచ్చుచున్నాఁడని విష్ణుతో నారదుండు నుడువుట.*—

క ॥ అనినన్నుఁ గినిసి శివుఁడో । య్యనఁ నా శ్రీగౌరి వలవ, దనినన్ వినకా । వనితామణితో నిటకుం । జనుదెంచె సమస్తమౌని, జనపరివృతుఁడై ॥ ౭౬ ॥ క ॥ తనయులు ప్రమథులు దిక్పతు । లనిమిషు లరుదేరవచ్చె, నాగడ పరుపన్ । నినునినునంగనగమ్మని । తనదైన విరక్తిలోక, తతి కెఱఁగింపన్ ॥ ౭౭ ॥ క ॥ అనునంత ద్వారపాలకు । లనఘపరా కబ్జనాభ, హరుఁడిదె చనుదెం । చినవాఁడు హజారముకడ । కనితెల్పఁగ నెదురుకొనుట, కై శ్రీహరియున్ ॥ ౭౮ ॥

—(*) విష్ణువు శివు నెదుర్కొనుట. (*)—

సీ ॥ మోదంబుతో లేచి, మేదినీ రమణియు మఱపులందీయర, మావధూటి । వలకేలు భుజముపై, నలవడ గ్రహియించి దాస దాసీజనుల్, తరుచుగొల్వ । కుముద విష్వక్సేన, కుముదాక్షులొకట హెచ్చరికలు సలుపంగ, చక్రగదలి । యందందఁ దగువార, లలబల ముదుపుచు నుపచారములఁ జేయు, నుచితలీల ॥ ౭౯ ॥ బంగరరిగెల నీడ సం, భ్రమముతోడ । వచ్చునటమున్నె శివుఁడుత, ద్వారసీమ । ప్రమథపరివృతుఁడగుచుఁబా, ర్వతిని గూడి । యచటి మొగసాల గడచి నె, య్యమునదలిర్ప ॥ ౮౦ ॥ క ॥ అరుదెంచు నంతలోన । ట్లరుదెంచుచు నెదురుడాసి, హరి కరమర్థిన్ । గిరిసుతఁ బూజింపఁగనిం । దిర పోఁ దోనరంగ సమ్మ, తిని బుచ్చితగన్ ॥ ౮౧ ॥ చ ॥ పరమమునీంద్రులున్ బరమ, భాగవతు ల్నిజభక్తకోటుల । గ్గరుడుఁ డనంతుఁడున్ మొదలు, గాఁగలవారలతోడనప్పుడ । ట్లరిగి యెదుర్కొనెన్ శివు, మహాముదమొప్పఁగఁ గౌఁగిలించెనా । హరు పరిరంభణ ప్రకట, మహాముగా మునుదాను గాంచియున్ ॥ ౮౨ ॥ క ॥ నీలాచలరాజము స । త్కైలాస నగంబు గదియ, గావచ్చునెడన్ । శ్రీలలనేశుఁడు హరియున్ । శూలాయుధుఁ డ



వును గదిసి, శుభకరమతులై ॥ ౮౩ ॥ గీ ॥ పరమ సంప్రీతిఁ బొదలిర, ప్పట్టునందు । కలిమి గుబ్బెతగుబ్బల, నలరుకమ్మ । కస్తురి విలాసవాసనల్, గలిగివెలయు । వెడఁదయురమున శ్రీహరి, వేడ్కనిట్లు ॥ ౮౪ ॥ మ ॥ హరునిండారఁగ గౌఁగిలించి కడును, ద్యద్భక్తితో మ్రొక్కెనన్ । సురనాథాంబుజ సంభవాదులమునిస్తోమంబులన్ సత్కృపా । కరదృష్టిన్ వెలయంగ జూచె రమచే, గౌరీమహాదేవిక । హారతిన్ బూజలుచాలసల్పరమణీ, సుప్రక్రియన్ గూర్చియున్ ॥ ౮౫ ॥ చ ॥ ఇటుల పురాణదంపతుల, నింపలరన్ సమయోచితక్రియా । ఘటన లమించు పూజనల, గౌరవమున్ మెఱయంగఁ జేసియు । త్కటబహు వాద్యరావవిత, త స్తుతిపాఠక వందిమాగధా । ర్భటమగు క్రందెసంగబహు, భంగిగ వేడుకలుప్పతిల్లఁగన్ ॥ ౮౬ ॥ సీ ॥ బంగారుచాలుకం, బములను మణిహేమ శిఖరకుంభములఁ, జెన్నుమెఱసి । గరుడకేతనమహో, త్కటమయి జిగిమించు తళుకుటద్దంపుగో, డల దనర్చి । పెనుపొంద నవరత్న, పీఠంబులవహించి గచ్చుటరుగుల ముద్దు, కల్మిఁబెరసి । ఘనతరంబగు మేలు, కట్ల రంగుచెలంగి కుసుమతల్పంబుల, కొమరు మిగిలి ॥ ౮౭ ॥

—(*) శివుండు హరి సభాస్థానంబుఁ జేరుట. (*)—

కలితమగు ధూపవాసన, ల్గలసికమ్మ । విరుల ఘుమఘుమంబగు నట్టి, వితతిఁ జని । వాసమునకా భవునిగొని, వాసవాబ్జ । భవముఖాదులు వెంటవెంట, బలసి నడువ ॥ ౮౮ ॥ సీ ॥ సముచిత గతిఁదదా, స్థానమంటపమున్ప్ర వేశించి యందఱు, వేరువేర । నహాసనముల సు, ఖాసీనులై యుండ నియమించి తాను ను, నిజసమంచి । తాసనంబున నుండి, యప్సర స్త్రీసంతతి యాటలుపాటలు, నభినయములు । భార్గవప్రముఖుల, ఫణితులబ్జాసన శతమఖ కిన్నర, సాధ్య సిద్ధ ॥ ౮౯ ॥ గరుడ గంధర్వ గణములు, కానకలొసఁగి । విన్నపము సేయు మనువులు, వినుచుమనుచు । మన్ననలుగల్గి శ్రీహరి, యున్నతరిని ॥ ౯౦ ॥

### — * హరి హర సంభాషణ. * —

ఉ॥ తద్దయుఁ దానువచ్చిన వి,ధంబది మున్నె యెఱుంగు జాణ తాఁ । బ్రొద్దు మెఱుంగునున్ గడకు,బొమ్మనుపుట్టువు గల్గువానితో । నొద్దిక మాటలాడుటకు, నూహదలిర్ప సభాస్థలంబు పెన్ । సద్దుడు గంగ చేసియుఁగ,సల్పి సమున్నతి నప్పుడెంతయున్॥౯౧॥ క॥ శంకరుఁ డభిముఖుఁడైయా । పంకజనేత్రునకు మృదుల,పద్ధతినను ని । శ్శంకుఁడయి నారదుఁడునను । గొంకక నిందించె నిందు,గొలువున నిన్నన్ ॥ ౯౨ ॥ క॥ దానవకోట్ల భ్రమింపఁగ । మానినివై వట్టినీవు,మతకరిమాయల్ । నేను గనినంత మరులను । బూనుచుఁ బ్రాకృతునిలీల,బుద్ధి చలింపన్ ॥ ౯౩ ॥ క॥ జ్ఞానము చెడి భువనాధిక । మానంబుడివోవ మరుసు,మక్రమ శరసం । తానములఁ గీడితుఁడనై । నేనిను బతిమాలుదునట,నీరజనాభా ॥ ౯౪ ॥

### —* మోహినీరూపంబు శివుండు చూడఁగోరి విష్ణునడుగుట. *—

క॥ నావైరాగ్యం బఖనికి । నీవిశ్వంబునకుఁ దెలుప, నెంచిన మతితో । నేవచ్చితి నిటకున్నీ । స్త్రీవిధమరయఁగనిప్పుడు,సిద్ధము గాఁగన్ ॥ ౯౫ ॥ చ॥ మొనయుము నాఁటినీభువన,మోహన భామిని రూపమిప్పుడే । కనుఁగొన వేడ్క యయ్యెడిని,గంజభవాదుల కద్భుతంబుగా । నినుఁగని నేవిరక్తమతి,నిల్చెద నారదమౌని చిన్నవో । యిన మదితోడ సిగ్గువడ,నీవెడనో దశరూప ధారణా ॥ ౯౬ ॥ చ॥ మరునిజయించి మృత్యువుప్ర,మత్తవిధం బుడిగించి లోకభీ । కర గరళంబుమ్రింగి ముర,ఘస్మర నీవెనుగన్ జగత్ప్రసిద్ధినేఁ । బరగిన నన్నొకం డనుట,పాడియె కామినిగమ్ము వేగమే । గుఱుకొని తళ్కు నీకులుకు,గుబ్బలు నిక్కఁగఁ జూచి మెచ్చెదన్ ॥ ౯౭ ॥ గీ॥ అనిన మందస్మితాననుఁ,డగుచు మదిని । బుండరీకాక్షుఁ డనుమాట,పొలుపుదక్క । యరుణ కమలాక్షుఁ డనునట్టి,పెరవుగంగ । నెలమిఁ దనలో వితర్కించె,నిట్టులను



చు ॥ ౯౮ ॥ క॥ నారదుఁడు లోకసాక్షి తె । గారూఢిన్ బలికినంత,కనలొందంగాఁ । గారణము తనకునేమిటి । నేరంబిది మది విచార,ణీయము వలదే॥ ౯౯ ॥ తే॥ ఆవిలాసిని రూపుమీ,రమరఁగనిన । బ్రమయుదురటన్న మాటమా,త్రమునకలిగి । కోపగించిన నది తప్ప,కొదవగాదె । తలఁప సర్వజ్ఞుఁడనుపేరు,గలుగుచోట॥౧౦౦॥ అనియిట్లు ॥ శ్రీ నిత్యాత్మకుఁ డంతరంగమునసన్, జింతించి రౌద్రాకృతిన్ । గానం డేమియుఁ దాకుతప్పితఁడహం,కారాత్ముఁ డెల్లప్పుడున్ । గానీయిప్పుడు మంచిమాటలవిప,ల్కన్ ధిక్కరించెన్ వగల్ । పూనన్ వెన్కను జూతమీతనిఘనం,బున్ బెంపు సొంపారగన్॥౧౦౧॥

### —(*) శివునితో విష్ణుండు మోహినీరూపంబు తమరు చూడవలదనుట. (*)—

చ॥ అనిమది చింతచేసి త్రిపు,రాంతకుఁ జూచి మురారి పల్కెనే । మ్మనమున వేడ్కఁగూడ జను, మానముతో ననుజూడవచ్చిద । ర్శనమొగిఁ బల్చనౌక్రియల,చక్కటి గల్గినయట్టి పట్టియా । పనికిటు సొచ్చినంత నగు,బాటుబు మాటలు వేయునేటికిన్ ॥ ౧౦౨ ॥ క॥ నాదగు వనితారూపము । మోదముతో నీకుఁజూడ,ముచ్చటగలుగన్। వాదింప వలవదిఁక మ । ర్యాదం జను మిప్పుడు చూడ,నగుఁదగినైనన్ ॥ ౧౦౩ ॥ క॥ ఇంకొకవేళను నన్మ । త్పంకజనయను నాఁడిలాస,పరిమాకృతిని । శ్శంకుఁడవై కనియెదుశివ । శంకర శైలేంద్ర చాప,సర్వజ్ఞహరా ॥ ౧౦౪ ॥ క॥ నాయింటికి విచ్చేయుట । శ్రేయస్కరమయ్యె నిన్ను,సేవించితిల । క్ష్మీయుతుఁడ నగుచు నీవున్ । హాయిగనీ యింటికరుగు,మని హరి పల్కెన్ ॥ ౧౦౫ ॥ ఉ॥ ఇందుధరుండు విష్ణునకు, నిట్లను నూరక మాయమాటలన్ । బొందిలిఁ బెట్టగాఁ దగదు,పంకజనాభ యొయారి యాఁడురూ । పందము గాఁగ నాయెదుట,నైజపు దేహముగి నిల్పి చూచెదన్। బొందుగ నీదుచిన్నెలగు,పోలిక చాలిక పెక్కుమా

టలన్ ‖ ౧౦౬ ‖ క ‖ అనికినట్లు వాడమి శివుఁడనఁ | గను బ్రమథులు భృంగిరిటులు,కడుఁ గ్రూరముగా | విననింతలగు దురుక్తులు | గొన కొని పలుకన్ సహించు,కొని శ్రీహరియున్ ‖ ౧౦౭ ‖ మ ‖ ప్రమదాకారముఁబూని యేసితని గర్వక్రౌర్యముల్ వాయఁగా| భ్రమఁబొందింపక యుంటినేని ప్రమథుల్పాపాత్ములై రేగి దే | వమునిన్ సంకట పెట్టకుందురె మనో, వాక్కాయ కర్మంబులన్ | విమతుల్ క్రూరతి మత్సర స్థులనియు,విష్ణుండు పల్కెన్ శివున్ ‖ ౧౦౮ ‖ ఉ ‖ మాన్యుఁడ వంచు నిన్నుఁ బలు,మారు నుతింపుచు నుండులీల సా | మాన్యముగా వచింతు నను,మానమొకింతయు లేక నీకునున్ | దైన్యము దెచ్చుచుద్దు వినఁ,దల్పవొ మంచిది భాగ్యమాయె నిం | కన్యవిచారమేల తుసు,మాయధుకార్యమె చక్కనయ్యెడున్ ‖ ౧౦౯ ‖ క ‖ అనబడుబు మెరయఁ బలికి న | వనజాక్షుని పలుకులకును,వనజభవాదుల్ | మనమున నట్లని తలఁచిరి | ఘనులీ హరిహరులు మతుల,గతులెట్లగునో ‖ ౧౧౦ ‖ క ‖ హరిమాయదగిలి భ్రాంతిన్ | హరుఁడాసర్వజ్ఞు మహిమ,లారఁడి బోవన్ | మరుబాములను దలంకునొ | పరమవిరక్తిన్ బ్రతిష్ఠ,పరుఁడౌనొకదా ‖ ౧౧౧ ‖ క ‖ అనికొందరనిరి వీరల | ఘనతరబహుమాయలెట్లు,గనఁగా వశమా | మనకిపుడు తనకు దానే | కనఁబడునటమీఁదం జూడ,గలమది యెల్లన్ ‖ ౧౧౨ ‖

— * విష్ణుండు మోహినియై శివునికి గన్పట్టుట. * —

చ ‖ తమకఁగనేల యుంచునము,దంబెద నిండగ నుండు నయ్యెడన్ | గమల దళాయతాక్షుని మొ,గంబునఁ దిన్నని నవ్వొలర్చిన | న్గమకముకల్గి పేరెములు,గైకొని పారఁగ వేళయుంచునా | సుమశరుఁడు గ్రుచ్చియదరి,శూరతఁ జూపఁగఁ బ్రాభవంబునన్ ‖ ౧౧౩ ‖ సీ ‖ ఆసభనున్నవా,రతి చంచలాత్ములై యందరు మిగులమో,హముల బ్రమయఁ | జనువఁబోయినతొలి,చదువుల కటమున్నె దాళకున దనరా,స్త్రంబుదో



ప | నఖిలజ్ఞులగువారి,కైన నెరుకచెడి ముక్తి కాంతామణి, మోము వంప | మందహాసాననా,నందుఁడై హరియోగ మాయనాకర్షింపఁ,జేయనపుడె ‖ ౧౧౪ ‖ గుబ్బ తిలవాసనలతోడి,గుబ్బలాడి | తనముదగుదారి గలనెర,తనముమీరి | తర్పితానంగ మోహనా,స్త్రంబనంగ | నిగుడి శివుమ్రోల నెలఁతయై,నిల్చి పొలిచి ‖ ౧౧౫ ‖ సీ ‖ శ్రీవత్స లక్ష్మంబు,చెలఁగి కొప్పున నుప్పతిల్లంగఁ గౌస్తుభ,దీప్తిమోవి | కడనిల్వ శార్ఙ్గకాంబు,కడఁదిక న్బొమలందు చెలువందఁ గాంచన,చేలమెరుగు | తనువునఁ బ్రకటింపఁ,దగు పాంచజన్యంబు సొగసు కంఠమునందుఁ, జొప్పడంగఁ | జక్రమహత్త్వంబు,జఘనసీమ నటింప మీనావతారమై,మెరయు కన్ను ‖ ౧౧౬ ‖ గవయు మీగాళ్ళ తామేటి,గతులు గుల్క | వెన్నుఁడను తెల్వి గనఁడాయె,విష్ణుమాయ| ప్రకటమయిడాయ తనమహా,ప్రతిభవాయ | నజ్ఞుఁడైయిట్లు శివుఁడుస,ర్వజ్ఞుఁడయ్యు ‖ ౧౧౭ ‖ సీ ‖ ఘంటల మొలనూలి,ఘణఘణల్ పాదనూపురముల రవళితోఁ,బూనికలయ | పైఁతాణి చెరఁగులో,పలితోడల్వలి పెంపుఁ జెంగావిపావడ,రంగుగాగ | మొగమున కెగయుచ,న్మొనలపై నరుణోష్ఠ సుద్యుతి కుంకుమ,సుంకు జేయ | పదియారు వన్నెయఁ,బసిడి మట్టెలడాలు చలువకుచ్చుల కంచు,జరతజూప ‖ ౧౧౮ ‖ సడబెడంగున కంచలు,కడుముదమున | విడువకెప్పుడు కాళ్ళను,కెళ్ళఁబెనఁగ | మహునికైనను దనసొంపు,మరులముంపు | కొన్మయైయొప్పి యొప్పుల,కుప్పయగుచు ‖ ౧౧౯ ‖ సీ ‖ నెరిగొప్ప విధులపైన్,బరిమళంబులు దేటి గుంపుల విందుకై,కోరిపిలువ | ముంగురుల్ గ్రమ్మిన,మురిపెంపు నదురల్ల కటిమబ్బులోఁ జంద్ర,కళను నవ్వ | మకరికా పత్రముల్,మదనాంక మగుచున్న మకరకేతనకాంతి,మరుపొనర్ప | మొగముచేరాజున,కొంగ నేత్ర లలితకై రవముల జిగిచామ, రములుగాఁగ ‖ ౧౨౦ ‖ గలికి నిడువాలు గన్నుల,కైపుకొలువు | వారలకువిరి తూపుల,వానగాఁగ | గళకు వజ్రంపు కమ్మల,తళుకుచెకుక | టద్దముల

మెఱుంగు బెళుకయి, ముద్దుమిగుల ॥ ౧౨౧ ॥ సీ ॥ నెరినీటు గంద క్రొ, న్నెల నామముబెడంగు మొగమునకెగయుచ, న్మొనలరంగు । సొంపైన కెంపుచే, ర్చుకట నిక్కు మెఱుంగు పంజులకమ్మల, ప్రభ వెలుంగు । గండ స్థలంబులం, గాంతులీనగ పొంగు కలిగిన ముక్కు ముంగర తెరంగు । నా ణెము త్తెపు కుతి, కంటుచెల్వు చెలంగు మెడకడమృగనాభి, మేలిభంగు ॥ ౧౨౨ ॥ లమర శృంగార మోహిని, మైనమంజు । వాణి పూబోణి నలి వేణి, వనజపాణి । సైకతశ్రోణి గనభ్రమ, ల్సందుకొనంగ । నెరుకలెల్లను నుడివోవ, నెల్లవారు ॥ ౧౨౩ ॥ చ ॥ కులుకు నొయారమా రజము, కూ రిమిమాటల నీటుపాయముల్ । గలకల నవ్వుచెల్వమును, గర్వపు మేని మెఱుంగు రంగుచి । న్నెలువలపంద చందముల, నిగ్గునొకాటపు సిగ్గు జ గ్గుతోం । గలికితనంబునన్ సభకుం, గానంబడన్ దమకంబు పెంపునన్ ॥ ౧౨౪ ॥ సీ ॥ కొమ్మ గాదిది పైడి, బొమ్మని యొకకొంద రనబొమ్మ గాది ది, యల్లమెరుగు । ప్రోవన్న కొందరు, బొరిమెరుంగుల ప్రోవు గాదిది చం ద్రిని, కళయటంచు । కనికొందరన చంద్ర, కళయుంగాదిది రతి చేనున్న మల్లెపూ, చెండు తెలియ । నౌనని మరికొంద, రన మల్లెపూచెండు గా దిది మరునిచా, కటపు మోహ ॥ ౧౨౫ ॥ నాస్త్రమని కొందరననిట్టు, లనుపుమెఱసి । సమధికంబైన తేజమ్వ, నమున నెరసి । వెలయు నామో హనాంగిచె, ల్వంగంజూచి । కోర్కులెదనిండ సభగనుం, గొనుచునుండ ॥ ౧౨౬ ॥ మదకుంభి కుంభ దేశము । వదలక దిగజారు మదము, వైఖరిద గియా । సుదతి కుచకుంభ యుగళా । స్పదమైయారొదవె రుచిర, సంప త్కరమై ॥ ౧౨౭ ॥

— (*) ప్రమథులు మోహినింజూచి వలచుట. (*) —

క ॥ తగనిటుల భువనమోహన । మగు రూపున విభ్రమింప, నందరు నానా । వగలన్ మరుబాముల చేం । బొగలంగ నవ్వేళం బ్రమథ, పుంజంబెల్లన్ ॥ ౧౨౮ ॥ చ ॥ తమతమ ప్రజ్ఞలన్నియును, దప్పంగ ధైర్య



ము క్రౌర్యముల్చెడన్ । గమకమడంగం జెప్పి దొలం, గన్బహు మోహ ము సంఘటిల్లంగా । భ్రమితరుచై తమింగొలుపం, బల్మరు వెఱ్ఱితనంబు లే ర్పడన్ । సుమశర తాడనంబులను, స్రుక్కి సభాసదులెల్ల నవ్వగన్ ॥ ౧౨౯ ॥ సీ ॥ ప్రమథుం డొకండొక, ప్రమథుం దద్భామగా భావించి గడ్డంబు, పట్టితివియు । భ్రమగొని యొకరుద్ర, భటుండొక శివదూతం గాంతగాంగనుంగొని, కౌంగిలించు । మరియొక శైవుండు, మామహేశ్వ రుసేవ కుని బడంతిగనెంచి, పెనగంబోవు । భవు భృత్యుండొకండు, పసిడి కంబపు బొమ్మం గొమ్మని ముద్దాడుం, గోర్కెమెరయం ॥ ౧౩౦ ॥ బట్టి యిటువంటి భంగుల, బెట్టివిష్ణు । యోగ మాయ విలాసమ, య్యువి దమైన । కారణంబున నప్పుడ, కజము గాగ । విరహి సివమెత్తి తెలి యక, వెనుకముందు ॥ ౧౩౧ ॥

—* శివుండు మోహినింజూచి మరులుకొనుట. *—

క ॥ మరుచిలుక పఠాణియనా । నొరపున్ శృంగారతయును, నొప్పగు సొగసున్ । గఱదల పొంకము మురిపెపు । నెరతనము స్ఫింక మపుడు, నేత్రగతంబై ॥ ౧౩౨ ॥ చ ॥ చురచుర గాడగా నతివ, చూపుల నన్దగు మోహనాస్త్రముల్ । కరకరి కోటిమన్మథు, లఖండ పరాక్రమ లీలం జేసిన । ట్లురువగు గుండె ఝల్లనగ, నొక్కట బాయగ ధైర్యమెల్ల ద । త్తరమునం దానువచ్చినవి, ధంబెద గానని చిత్తవంతతోన్ ॥ ౧౩౩ ॥ చ ॥ అనుపమశీలి శూలితన, కైన వివేకము జ్ఞానముల్ఘనం । బును బ హు శౌర్యసారము ప్ర, భుత్వము తత్త్వము తెల్వి గోల్పడన్ । మనసిజ బాణభిన్నతర, మానసుండై తనలోనవాను న । వ్వంత విలాస వైఖరు లు, వర్ణనజేసెను బెక్కుభంగులన్ ॥ ౧౩౪ ॥ శా ॥ నారీరత్నములన్ జగమ్ములను నెన్నన్ జక్కగా వింటిం గ । న్నారంగన్గొని యున్న వాండంగదయో, యబ్జాక్షి యొయ్యారము । య్యారే మేజవరాంద్రకు న్గలు గగా, దౌరౌర యీయింతయ । య్యారే లక్షవరాలు సేయు నిపుడా, హాయోహ లింకేటికిన్ ॥ ౧౩౫ ॥ గీ ॥ చాంగురె విలాస మజ్జరే, చక్క

దనము । మాయురే యారజంబుని, మ్మానవతికి । నెవ్వఁడోపతి పేరే
మొ, యెచటనుండి । యిటకువచ్చెనో ప్రేమన, న్నేలుకొనదొ॥ ౧౩౬ ॥
సీ ॥ చిమ్మ చీఁకటియొప్పఁ, జిలుకు తుమ్మెదకప్పు గప్పునీజవరాలి, గొప్ప
కొప్పు । మంచిదామరగోము, మించు వెన్నెలగము నామకోనౌనునీ,
లేమమోము । కమ్మని బంగరునికుఁ, చిమ్మనద్దపుఁ టెకుఁ హాకుఁగాని
కుఁసీ, యతివచెక్కు । లగును చక్కఁదీవి, చిగురులై యెలమావి తీవి
యైయె యాతన్వి, కావిమోవి ॥ ౧౩౭ ॥ గట్టిపోడిమిగను గను, పట్టుదీని ।
చన్నుకట్టునఁ దమిబుట్టు, నెన్నవన్నె । గన్న నీచిన్నె లాడిచ, క్కనగుమే
ని । మించు తొలకరి మించాక్ర, మించిమించు ॥ ౧౩౮ ॥ అనితనలోదా
నూహించి ॥ క ॥ మరులు మదినించు మోహము । కరకరిఁ దమకించు
లేవ, గా గమకించున్ । ఇరుగడలం గురిగాంచున్ । తరిగాదంచు న్దలం
చుఁ, దమిమరలించున్ ॥ ౧౩౯ ॥ ఉ ॥ జారు పయింటలో గులుకు చన్గ
వపైఁ గొనగోరులుంచగా । గోరు నొయారిచూపులల, కోర్కులు డెంద
మునందుఁ గుప్పగా । గూరగ జెగ్గడిల్లితమి, గొల్పుచుఁ ధేనియలూరు
మోపిపై । తీరగుపల్లు కెంపులుగ, దింపగ సొంపుగలోన నెంచుచున్॥
౧౪౦ ॥ చ ॥ కనుగొనఁ గొంకు వేడుకలు, గన్పడఁజూచిన మోము ద్రి
ప్పునో । యనుభయ ముప్పతిల్ల మొన, యున్నిటు పిల్చిన బల్కకెక్క
డన్ । జనునొయటంచు బిల్చినకు, జంకును దత్తను సుందరంబుగ । ల్గని
తనుగన్న మెచ్చదను, కైవడిఁ గాయము మాటు సేయుచున్ ॥ ౧౪౧ ॥
వన్నెవితర్దిఁ నీడ సభ, వారు గనంగను ముచ్చటాడగా । గన్నను చా
టొకింత నిట, గన్నను సన్నకుసన్న గాగనీ । కన్నుల కల్కి నల్కకొ
ని, కౌగిటఁ నిప్పు ప్రియంబెలర్పనే । నున్నతి మోహముప్పతిల, నోక్కట
నున్ రతికేళిఁ దేలనే ॥ ౧౪౨ ॥ క ॥ ననువంటి రసజ్ఞునికీ । వనితామణి
దొరికెనేని, వలపునిగుడరో । మ్మునగ్రుచ్చి కౌగిలింపుచుఁ । గొనకొని
రతికేళి నేలు, కొననేబాళిన్॥ ౧౪౩ ॥ గీ ॥ చులుకగాననన్న గొలువెల్లఁ,
జూచుచున్న । నలిగి నాతోడఁ బార్వతి, పలుకకున్న । విన్నవైయున్న



బ్రిమథులు, వెన్నుఁడింతే । యుగ్రుని గురుత్వ మనియన్న, నుండనిమ్ము ॥
౧౪౪ ॥ క ॥ చిన్నెలు వన్నెలు గలయా । చిన్నారి మెఱుంగుబోడిఁ, జి
క్కించుకనే । మన్నన నేలకయుండిన । మన్నా నాజన్మ మేల, మరిబ్రతు
కేలా ॥ ౧౪౫ ॥ వ ॥ అనియిట్లు శంకరుండు మోహినీదేవింగాంచి మ
న్మథబాణ పీడితుండయి యువ్విళ్ళూరుచున్నంత ॥ ౧౪౬ ॥ క ॥ ఆవలి
కథ నెఱిఁగింపుము । నీవాక్సుధ గ్రోలు తలఁపు, నెక్కొన మదియెంతో
వేడుచున్నదనిరా । జావైశంపాయన ముని, నడిగినయంతన్॥ ౧౪౭ ॥ శా॥
శ్రీసర్వజ్ఞ కుమారయాచ పృథివీ, భృత్పుత్రదీనావనా । ధీసంపజ్జిత దే
వతా గురువరా, ధీరాగ్రగణ్యామహా । రాసక్రీడ పరాయణాచ్యుత
సద్భృఙ్గ్రాజత్సుఖా స్వాదనా । నాసత్యప్రతిమాన సుందరతనూ, నారీ
మనోవల్లభా ॥ ౧౪౮ ॥ క ॥ శ్రీవీరమాత పౌత్రా । భూవర సంస్తూ
యమాన, భూరిచరిత్రా । భావాళీ పుంజాన్విత । భావజరిపు దైవరుచి
ర, పద శతపత్రా॥ మాలిని ॥ విమల గుణనిధానా, విక్రమారోకపమా
నా । నముచిదమనభోగీ, నవ్య సంగీతరాగీ । శమిత రిపు సమూహా,
శాంతవిద్యా విమోహా । సముచితపద వేదీ, సంచితాగామి భేదీ॥

గద్య॥ ఇది శ్రీమ ద్దత్తాత్రేయ గురు చరణారవింద మకరందబిందు
సందోహ నంది మాన సేందిందిర భద్రకాళీ వర ప్రసాదిత
కవితా చమత్కార కుమారయాచ నృప దత్తకృతిక న్యకాయ
జ్వ నామాంతర భాసుర రోసనూరి లింగనా మా
త్య పౌత్ర గంగన మంత్రి పుత్రి కాశ్యప గోత్ర
పవిత్ర వజ్రకంకట విశంకటమతి వేంకటపతి
కవి ప్రణీతంబైన విష్ణుమాయా విలాసం
బను శృంగార ప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ ర స్తు.

---

# శ్రీ విష్ణుమాయావిలాసము

## తృతీయాశ్వాసము.

క ॥ శ్రీవెల్గోటి కులేశ్వర । భావజ రూపావతార, భద్ర యశ స్సం । భావిత కుమారయాచమ । హీవరుసుత రత్నబంగ, రేచ నృపాలా ॥ ౨ ॥ అవధరింపుము ॥ క ॥ దేవా జనమేజయ ధా । త్రీవల్లభుక ర్ణములకు, తెందేపలుగా । శ్రీవాక్సుధారసము చూర । గా వైశంపాయనుండు, ఘనముగ బల్కెన్ ॥ ౩ ॥

### —* సభవారు మోహినింజూచి మోహితులగుట. *—

గీ ॥ సభయు శృంగారవనముగాc, జంద్రవదన । యొకర్తియ యుండు చందంబు, నొంద శివుcడు । బంటిపాటయ్యె చెలిగూడ, నారప టంచు । వేడ్కc జెలువొందనున్నట్టి, విధము వినుము ॥ ౪ ॥ సీ ॥ బహుపాదవటమహీ, రుహముల భంగిని తపసిగుంపులు మహో, త్కటముగాగ । కనకసాలంబుల, కైవడి లలిమించి కనకసాలంబులు, ఘనముగాగ । గాలవ కౌశిక, ఖ్మాజంబు లట్టుల గాలవ కౌశికుల్, క్రమముగాగ । సుమనోవితానవి, భ్రుతలీలలు వహించి సుమనోవితానము, ల్సొంపుగాcగ ॥ ౫ ॥ చిత్రకుడ్యపు బహుచిత్ర, పత్రతతులు । విహగ మృగపరి విభ్రమ, మహిమ వెలయ । నపుడు శృంగార వనమయి, యభవుదృష్టి । కిని సభామండపంబురా, గిల్లెమరియు ॥ ౬ ॥ పొలుపుగ తెంపుటోవరులc, బూచిన మోదుగలై తనర్చియు । జ్వాల నవధూప ధూమపరి, జాలము నీటగు తేంట్లు గుంపులై । చెలువమరంగc జూచి తన, చెంత లతాంగియు



నైగc జేయcగా । గలిగినయట్టులైనమది, గాతుక ముప్పతిలంగ నుండగన్ ॥ ౭ ॥

### —* వసంతఋతువర్ణనము. *—

ఉ ॥ ఆసమయంబునన్ జిగురు, టాకు కటారున కాపుc డొటచే । బాసటమై వసంతుcడుక, పర్ది పయిన్ దళమెత్తినట్లుగా । భాసుర కోకిలాలపన, బంధుర కీరవిరావ భూరుహ । శ్రీసముదీర్ణ పల్లవవి, చిత్రసుమోద్గమ మల్లసిల్లగన్ ॥ ౮ ॥ సీ ॥ కుజవర్గమునకు నా, కులపాటు గలిగించి పైకంబు గైకొన, బనుచుజాణ । సుమనోభిరామవి, స్ఫూర్తి మధువ్రత ప్రముఖుల మన్నించు, భాగ్యశాలి । వినుత ఫలాహార, పృత్తుల శుకముఖ ద్విజులు సంతోషింప, వెలయుధాత । కులవిజాతులc దన, కడనిల్వగానీని సకలాగమాధిక, చతురమూర్తి ॥ ౯ ॥ మధుcడు సాక్షాత్కరించె మ, న్మథుcడు తనకు । నెయ్యమొటను బలిమిరా, ణింపనింపు । మోహనాకృతి సర్వజ్ఞ, సాహసత్వ । మనువు పడగను వేడ్కన, వ్వనితలమున ॥ ౧౦ ॥ గీ ॥ కామమత ధర్మశాస్త్రంబు, కలిమి మెరయ । పంచములు మాధవార్చనc, బాలుపడగ । ద్విజుల పక్షము సేవించె, విధువు మధుcడు । నఘటనా ఘటన సమర్థుcడగుటవలన ॥ ౧౧ ॥ సీ ॥ నీలాల నిశ్రేణి, నెజి వేణి సవరించి పద్మాననస్ఫూర్తి, పరిఢవించి । కుందకుట్మలదంత, సుందరంబు వహించి కువలయనేత్రయై, భవముగాంచి । సురుచిరపల్లవా, ధరరక్తిను ఘటించి సుమగుచ్ఛ కుచయుగ, స్ఫురణమించి । జరఠ పలాశకాం, చనచేలము సడల్చి వికసిత కింశుకాం, శుకముదాల్చి ॥ ౧౨ ॥ లలిత శృంగార భావక, ళానిరూఢి । దిశలనెల్లను వనలక్ష్మి, తేజరిల్ల । నలరె వలవంతలైనయకాం, తులు నితాంత । రాగ సంభ్రాంతులుగవసం, తాగమంబు ॥ ౧౩ ॥ సీ ॥ వనదేవతా ఘన, స్తనకుంభ సంభృత ప్రచురకుంకుమ పంక, రుచియనంగ । సాంద్రమహీరుహో, జ్జ్వలకోటరోన్నట ద్భుజగ జిహ్వాంచల, స్ఫూర్తి యనగ । సంతతానంద

వ,సంత కరన్యస్త లాలిత శోణాక్షు,తాలియునఁగ । మదనశిరస్స్ఫుర,న్మణిమయకోటీర కమనీయకాంతిసం,ఘుంబనంగ ॥ ౧౪ ॥ నలరె శుకపిక కలరవ,కులరవాలి । శారికా నిస్వనా కీర్ణ, సారవివిధ । తరునికరములదీప్తిసుం,దరపుఁగెంపు । సవురు నిరసింపు సరసంపుఁ,జివురుగుంపు॥ ౧౫॥ చ ॥ వనయువతీ వసంతుల వి,వాహ మహోత్సవ వేళ నెమ్మదిం । దనరు కుతూహలంబునల,తా లలనల్ కరపల్లవంబులన్ । ఘనముగ సేసబెట్టుటకు,గాధరియించిన మౌక్తికంబులో। యన విలసిల్లె నెల్లెడమ,హాసుకుమారక కోరకావళుల్॥ ౧౬ ॥ గీ ॥ వనము గాఁగ వసంతమా,ధవుని కొలువు । కూటముననలరు మేల్కట్లు,గుమియునంగ । మహిత వైభవ వనమహీ,రుహములందు । కొమరుమీరిన పుష్పాళి,గత్తులమరె॥ ౧౭॥క॥ సురుచిర వైరించ సరో । వర పికవాంభోజకైరవవ్రాతలస। త్పరిమళ కుతుకిత మదబం। భరనిస్వనమెసఁగ విసరెఁ,బవనాంకురముల్॥ ౧౮ ॥ చ ॥ అత్తరి నిండుచాయ చిగు,రాకులవిందులు గండుకోయిలల్। మొత్తముగాఁగ బారులయి,ముందట నిల్వఁగఁ జిల్కతాళియున్ । దత్తరమందగా జిలుక,తత్తడిరౌతు జరాన తమ్మిపైన్ । గత్తినిదూసి పోకుమని,గ్రక్కున డాయుచు ధాకసేయఁగన్ ॥ ౧౯ ॥

— * భద్రాసనంబు డిగ్గి శివుండు మోహినివెన్నడుట. * —

సీ ॥ భద్రాసనము డిగ్గి,పైనున్న బెబ్బులి వల్వ యుప్పటిజార,వలపుమీర । తడబడ నడుగులు,వడక నడుము మెన కలయంగ జెమ్మట,గ్రమ్ముకొర । మోహవార్ధిని మునింగి,ముందు వెనుకయు గాన కయుప్రమదాశ్రుల,కణము లురుల। చేసినిల్చినమాయ,దారియా త్రిపురవి దారిగనుంగొని,వేరెయొక్క ॥ ౨౦ ॥ మొల్లపువ్వుల గుమి పొద,రిల్లు దారి। దూరి కడువేగ దారిన,తోననరిగి । వెలది నచ్చట గానక,వెతలనొరిగి ॥

— * మాయమైపోయిన మోహినిని శివుండు వెదకుట. * —

చ ॥ పగడపు మోవియున్ గొమరు,పాయపు సిబ్బెపు గబ్బిగు



బ్బలున్ । జిగితొడ లందపు న్దళుకు,చెక్కులటొక్కు నొయారి పిక్కలున్ । నగుమొగముం జెలంగనగు,నాతిఁ దలంచుచు వంతెగుందపె। న్నిజగురు కటారిచేఁబొడిచి,చిత్తజుఁ డిట్టటుసేయు డెందమున్ ॥ ౨౨ ॥ ఉ॥ గుత్తపు గుబ్బలాడి కడ,గూర్చిన మోహవశంబు పెల్లునన్ । జిత్తజుబాణి కగ్గమయి,చిక్కిన మిక్కిలి యుత్తలంబుపెన్ । దత్తర ముప్పతిల్లుటను,దల్లడవెల్లడ నోర్వలేకవె । త్తెత్తినవాని కైవడిగ,నిందు ధరుండటఁదీనవత్త్రుఁడై ॥ ౨౩ ॥ ఉ ॥ చక్కని ముద్దుగుమ్మ యల,జవ్వని కుల్కుల గుబ్బలాడిమ । న్నిక్కడ నిల్చియుండెనను,నిక్కడ మెల్లనె సైగచేసెనే। దిక్కనకేగనో యెరుఁగ,ధీరతినెక్కడ జూచి కందునో । యక్కట పచ్చవిల్తునిశ,రాహతి నొచ్చితి నేమిసేయుదున్ ॥ ౨౪ ॥ చ ॥ పొలతిరో నీవు పొన్నవిరి,పుప్పొడి నెప్పగు తిన్నెమీదటన్ । జెలువొగి కుల్కునిల్చినను,జేరగజీరితి కన్నుసన్నలన్ । బలుమరు ముచ్చటల్ బెరసి,భావజుకేళినిగూడ నింతలో । నళిన దళాయతాక్షి మరు,నవ్వులకై ననుడాగురించితో ॥ ౨౫ ॥ క ॥ అనిప్రేమ నివ్వటిలగా । ననవిల్తుని చేతిరంతు,నకుగాక శివుం । డనువనర వెదకుచుంగను । గొనె మరుని కటారి చూపు,గుమ్మమిటారిన్ ॥ ౨౬ ॥

— (*) రతనంపు తిన్నెపై బంతి యాడు మోహినిన్మఱల శివుండు గనుట. (*) —

ఉ ॥ నిక్కెడు గుబ్బచన్నవను,నివ్విపైటచెరంగు రంగునన్ । బొక్కిలి చెంతపీడి కడ,బోయిన కుచ్చెల వామపాణిచే । జిక్కగబట్టి హారములు,చిక్కుపడన్ రతనంపు దిన్నెపై । నొక్కెడ గూరుచుండి ముది,నోడక వీడక బంతియాడఁగన్ ॥ ౨౭ ॥ ఉ ॥ కాంచిన పెన్నిధానమెడ,గాంచిన పేదవిధాన గోరికల్ । మించగ నింతిఁ గంటినిదె,మేలమరన్ మఱుబంగనంచున । ప్పంచశరారి మోహముప్పఁ,బల్మగు నావగలాడిచెల్వారా । ణించగ నాడుకందుక మ,ణిప్రభ మించ నుదంచితాత్ముడై ॥

౨౮ ॥ క ॥ తరుణాబ్జపాణి వరసుం । దర హస్తతలంబుఁ జెందీ,తరు
ణార్కరుచిన్ । గరమరుదై చూడఁగఖర । కరుమాడ్కిన్ గందుకము
ప్ర,కాశితమయ్యెన్ ॥ ౨౯ ॥ గీ ॥ ముద్దు రాకేందుముఖి నగు,మొగము
చెంత । కెనయయునప్పుడ చూడఁబూ,ర్ణేందుమండ । లంబు వలెనున్నవీ
కందు,కంబులింత । గణుతిసేయంగ మదికిన,క్కజముగాఁగ ॥ ౩౦॥ క॥
ఈపొలతి చూపుగమిపెను । బ్రాపుగ వహియించినపుడు,పాకారి మ
ణి । శ్రీపజ్జ్కలీనుచున్నది । బాపురె యీకందుకంబు,ప్రతిభ దలిర్పన్ ॥
౩౧ ॥ చ ॥ ఎగసిన బంతిఁజెనొడయు,నీ వగలాడి చెలంగు పొంగుమే ।
నాగియల బైరి డేగవలె,నుండెడి గుత్తపు గుబ్బలప్పడా । మొగమున
కొక్కమై నెగయు,ముచ్చట చన్గవ జక్కవల్వడిన్। నెగిరి ననంగఁబో
వుగతి,నింపలరె న్బళి దృగ్విలాసమై ॥ ౩౨ ॥

—*శివుడు పొంచిపట్టుకొనగా మోహినిచిక్కయదృశ్యయగుట.*—

సీ ॥ అనుచును జింతించి,యతను బాధసహించి మెళుకువ సవ
రించి,మెల్లపొంచి। పట్టంగ నుంకించి,పదరాట ముడిగించి యడుగుచప్ప
డగించి,యాసమించి । గుజ్జు లేమావిడి,గుబురుల కగుదెంచి యనువు
గాఁ దగినట్టు,అబ్జగాంచి । యొడలొకించుక వంచి,యొకనేరుపువహిం
చి యింతివెనకఁ జరించి,యేమరించి ॥ ౩౩ ॥ కదిసిపట్టెను నెట్టనఁ,గౌఁ
గిలించి । చంచలాక్షిని నప్పుడు,సంతసించి । పట్టిననునొట్టి బయలయి,
పడతిలేక । రిత్తయగుటను వలవంతఁ,దత్తరించి ॥ ౩౪ ॥ క ॥ చేతగల
ధనముపోయిన । యాతని చందానఁ జింత,నటమట పడుచున్ । నాతిన్
గౌగిటఁగానక । భీతిల్లగ మరుఁడుగదిసి,భీకరపరుఁడై ॥ ౩౫ ॥ ఉ ॥ గ
ర్వమెలర్పగా సతేఁడు, కన్నుల వింట సుమాస్త్రముల్ వడిన్ । బర్వగ
గండుతుమ్మెదల,బల్పగునారినిగూర్చి యేయగాఁ । బూర్వపు వైరమున్న
లచి,బోరన నెమ్మది బెగ్గడిల్లనా । శర్వుఁడు చింతవంతలను,సారెకు ని
ట్లని పలుక నయ్యెడన్ ॥ ౩౬ ॥ చ ॥ కమలదళాక్షి నిచ్చటను,గౌగిటఁ



జేర్చుట కల్లయయ్యెమ । భ్రమయొ సుమాస్త్రిమాయయొ,తరంబెఱుఁ
గన్ గలయో నిజంబొచి । త్తమునకుఁ గాంతగాక,మరి దబ్బరయైనను
గానిపించునే । రమణి నిజంబయైననుది,రంబుగఁ గన్పడకిట్లు వోవునే ॥
౩౭ ॥ చ ॥ ఎటువలె వేగువాఁడ నిఁక, నెకడఁ జొత్తును నెందు గం
దునా । దట వగలాఁడి కందుకము,తప్పకనాడెడుపొందుఁజూచి చె ।
ష్మట దిగజారుమోము,పలుమారును మద్దొనరింపఁ జేరుచో। సటమట
మయ్యెగా మెఱుఁగు,టద్దములోపలి చంద్రుకైవడిన్ ॥ ౩౮ ॥ చ ॥ అ
ను వలరారగాఁ బటికి,నార్చిన గుబ్బల పైడిబొమ్మలా । గున నడయా
డ నాసగొని,గొబ్బునడాసిన లేకపోయెనే । మనివిధి నెంతుసింక,నరు
దారఁగఁ దియ్యని మోవి యానియా। వనితను బువ్వవిల్తు రతి,వైపునఁ
గూడని జాడలేనిచోన్॥ ౩౯ ॥ చ ॥ విరుల లకోరికాఁడు తన, విద్యను
బొందుగఁ బద్దువట్టియు । వ్వరి పొదలందువేగ నలి,వేణిని డాచెనొజొ
చ్చిచూచెదన్। నెఱిగురి గాఁగనంచు మరి,నిల్చినచోటను నిల్వకేగియా ।
హరుఁడు చరించె భూరిశుహ,నా గహనాంతరసీమ నెల్లెడన్ ॥ ౪౦ ॥
అప్పుడు ॥ గీ ॥ వెట్టకెందొవ గరిడిలో, మెఱయునట్టి । యొజ్జపుప్పొడి
మంటిలో,నెపుడుబొరలు । తుమ్మెదలజెట్టి తండముల్,గమ్ముకొనియెఁ ।
దఱచు ఝుంకార హుంకృతుల్, దలఁకొనంగ ॥ ౪౧ ॥ చ ॥ చిలుకలు
గండుకోయిలలు,చేరికఁజేసిన కాకలిధ్వనిన్ । గలకలమంచు డెందము
వ,కావకలైనటుజేయఁ గేకలన్ । బిలపిలమూఁగి కేకిఋగ,భీరవుఁగో
రికలూర శారికల్ । పఱరొదలన్ ఘటింపఁ జల, పట్టి మరుండని బెట్టె
నోయనన్ ॥ ౪౨ ॥ క ॥ నిర్వాహము చికకయా । సర్వజ్ఞుఁడు దీన
వృత్తిఁ,జపలాక్షినినా । పర్వేందుముఖిని దలఁచియు ఖర్వక్రమ మో
హజనిని,కారుండయ్యెన్ ॥ ౪౩ ॥

—*శివుండు మోహినిం దలఁచి దలఁచి విరహవ్యథంబడుట.*—

క ॥ ఆపావలదేమి చెప్పను। నాపొలఁతిన్ దలఁచితలఁచి,యర

విరిసురువిల్ । తూపుల గ్రుక్కుచు మతిచెడి । తూపొడువన్ నేరఁడత
ను,తోఁ బగగొనటన్ ॥ ౪౪ ॥ క ॥ తలమనిన చంద్రుఁడెంతయు । దల
మని తనుద్రోఁచిపెట్టె,దనమున్ జలమున్ । దలమిగులునట్లు గలసిన। దల
మె చలివెలుఁగు నెకలఁ,దలఁకింపంగన్ ॥ ౪౫ ॥ క ॥ మగవారు లేరటంచు
ను । తగుతన మొలకోక విడిచి,తగుటుల జిగిమే। లగుచేల గట్టినట్లై ।
మగువ రహస్యాంగదృష్టి,మానఁబగుటన్ ॥ ౪౬ ॥ నిజ గేహము వెలు
వడిని । రజబాణుఁడు గదిసి సుమశరప్రహతులచే । గజిబిజిచేసిన ధై
ర్యము । విజవిజనై తన్నుఁగొనవి,పేకము చెదరన్ ॥ ౪౭ ॥ సీ ॥ మరుఁ
డు చంపకమన్నె,కరుణనన్ బ్రోవనీ కాళ్ళకెమ్రొక్కెదు,గమలపాణి।
కోపించు మరుబారి,గొఱియగాకుండనన్ గావు దండమునీకుఁ, గంబు
కంఠి । కుసుమాయుధుని బాధ,కును దాళ దిక్కుగు నాకునీ జోహారు,
నాగయాన । రతిరాజును దలంచి,బ్రతికించుకొనుము నన్ శరణు ని
న్వేఁడెదఁ,జంచలాక్షి॥ ౪౮ ॥ ఇట్టిసమయాన నన్నుఁజే,పట్టియాగి। బం
టుగా నేలుకొనిననీ,పనిచినట్లు । లూడిగములెల్లఁ జేయుచు,నుందుసెం
చు । భక్తిలోనూన నీమృదు,పదములాన ॥ ౪౯ ॥ చ ॥ చెలు వలరన్
బ్రసన్నమయి,చేరఁగరాఁగదె తళ్కులీను బల్ । జిలిబిలి చెక్కుగోరఁ
గొని,చీరఁగ నీగదె రంతుఁజేయుచున్। బలువిడిఁ గంతు మూఁకలివె,
బారులుదీరెను దాళలేనెనా । పలువగలెంచి మించుతమిఁ,బ్రాణములె
త్తవె ముద్దుకోమలీ ॥ ౫౦ ॥ క ॥ అనియిటుల నూహమిగులన్ । దన
లోన దలంచికొనుచుఁ,దమి రెట్టింపం । గనుబల్కు చిలుకపల్కులు ।
విని వనిత యెలుంగులనుచు,వేడుకఁ జనుచున్॥ ౫౧ ॥ క ॥ శారికలరో
దలు వినియొ । య్యారియె చదివెడి నటంచు,నచ్చటికరుగున్ । మీరునవ
లతికఁగని శృం । గారిణిఁగా నెంచి గ్రుచ్చి,కౌఁగిటఁజేర్చున్ ॥ ౫౨ ॥
గీ ॥ ఇత్తెఱంగున వనమునం,దెల్లభ్రమసి । తిరుగఁగల చోటులెల్లను,ది
రిగి తిరిగి । యరసి కలకఁటిఁ గానక,యలసిసొలసి । చూడ్కినిగుడిం



చి దిక్కులు,చూచుచుండ ॥ ౫౩ ॥

—(*) శివుండు లేమావిగుబురులందు తూఁగు
టుయ్యేల నూగు మోహినిం గనుట. (*)—

క ॥ అత్తఱి నీనులవిందై । యుత్తమమధురతరనాద,మొకటరు
దెంచెన్ । జిత్తజవిరోధికినిజ । చిత్తంబమృతోపమాన,చిత్రసంజెం
దన్॥ ౫౪ ॥ ఉ ॥ చల్లని వాసనల్ మిగులఁ,జల్లెడు తెమ్మెర తేరదెక్కి
పెన్ । నల్లని చెరుకు విల్లుగొని,నాయమె పువ్వుల కోలవేసినీ । వెల్ల
ఘునజ్ఞులన్ దరిమి,యేఁచఁగ నైఁచక పంచబాణమే । లుల్లసిలంగ నిల్వ
మిఁక,నొక్కట పుణ్యము నీకు గల్గెడిన్॥ ౫౫ ॥ ఉ ॥ బల్లిద పంచబాణ
నిసుఁ,బ్రార్థనఁజేసెద నాటివైరమున్ । గొల్లపడంగఁ గూయుగతి,
గొబ్బున ఝాంకరణ న్మిళిందముల్। నల్లని మాఁకగాఁగదిసినన్, మది
బెగ్గిలి భీతుఁడయ్యెనా। తెల్లనివేల్పుగావు మతి,దీనుఁడు నిన్ శరణంబు
వేఁడెదన్ ॥ ౫౬ ॥ మ ॥ అనుసమ్మంజునినాదము న్మదికిన,త్యంతంబుసం
తోషసం । జననంబౌటను వంతకొంతనిలువన్,సర్వజ్ఞుఁడవ్వేళని । ట్ల
నుచున్ జింతనజేసెనీ మధురవా,క్యంబెన్నగా మీఁదటన్ । నెనరుప్పొం
గఁగ మించి పల్కినవివ,ర్ణింపంగ నెబ్బంగులన్॥ ౫౭ ॥ క ॥ కాఁజేని
యుట్టి పరిపూ । ర్ణాదరము వెలగఁ బల్కున,తఁడెవ్వఁడును । ర్యాద
గలవాఁడు కానీ । నాదము తెఱఁగరయకుండ,నాకుందగునే॥ ౫౮ ॥ క॥
అనియూ నాదమువచ్చిన । యనువగు పథమరసి నడిచి,యటగనెఁ దరు
ణిన్ । బెనుపగు గపురపుటనఁటుల । గొనబౌ లేమావిగున్న,గుబురు
లనడుమన్ ॥ ౫౯ ॥ మ ॥ మగఱారంగు మెఱుఁగుకోళ్ళ జిగిస,మ్మ
ర్దంబు గావించుబల్ । పగడంపున్ లతలానఁగా మృదులమా, పర్యం
కమునగ్గిమె । చ్చుగ బంగారపుఁ దూఁగుటుయ్యేల కడన్,సమ్మోదినై
యూఁగుచున్ । దిగువన్మెట్టిన కాళ్ళమెట్టియలు నం,దెల్ దిఁధిమన్ మ్రో
యఁగన్ ॥ ౬౦ ॥ సీ ॥ నిగిడెడు మెయిచాయ గగనభాగము డాయఁ

బంగరుతేఁటులు కొప్పు,పూలబ్రోయి । కులుకు గుబ్బలజాడ,కులుకు
కొనసియాడ బంగారుపైఁటచే,అంగుజార । నొయ్యారియాతాఁగ,యు
య్యాలలోనూఁగఁ దమిలేచి బాలేందు,ధరుఁడుచూచి । పోయినప్రాణ
ము,ప్పుడుమళ్ళి చనుదెంచి యొడలునగాంచిన,ట్లుత్సహించి ॥ ౬౧ ॥ కం
టి నారార మజ్జయీ,కలువకంటి । పలుకు ముందర నేఁగంటిఁ, బచ్చ
వింటి । బోయ కడగండ్లు విడనొంటి,పూవుపొదల । నొంటిగా నేలు
కొననిలఁ,గంటిమంటి ॥ ౬౨ ॥ ఉ ॥ పొన్నలనీడ నన్ను మరి,పొందికతో
డను గూడ వేగ చే । సన్నలుగూడ పిల్చునోకొ,చానటుబిల్వక పోయెనే
ని యే । నెన్నివిధాలనైనఁ దమి,నీవలనన్ నవలం జనంగనీ। కున్నతి
గబ్బిగుబ్బలెద,నూనగ బిగ్గనఁ గౌఁగిలింపుదున్ ॥ ౬౩ ॥ క ॥ అనితనలో
పల మఱియున్ । బెనఁగొనగాఁ గోరుకలపుడు,పేర్చినమమతన్। గొ
నకొని యిట్లని పలుకన్ । గనుఁజొచ్చెన్ శివుఁడు మోహ,కౌతుక మ
తియై ॥ ౬౪ ॥ గీ ॥ విరుల సరమైన యెడలన,వ్వాలఁదినన్ను । హెచ్చి
మెలపున శిరసావ,హించుగాదె । అల్లపైఁట చెఱంగునే,నైతినేని। క
లికి తనకుఱికి గుబ్బల,గప్పుకొనదె ॥ ౬౫ ॥ చ ॥ నెలకొను పచ్చకప్పు
రము,నేనయినన్ ననుజూచి ముద్దయ । చ్చిలుకలకొలికి సమ్ముఖము,
చేసెటురమ్మని చేరఁజీరితా । మలయుచు నోరునిండగల,మాటల తేటల
గారవించుని। చ్చలు నిటువంటి పుట్టుకల,చందము నొందని బేలనైతిగా॥
౬౬ ॥ ఉ ॥ ఐనను నిప్పుడేమి కొదవ,వాయె నదెల్ల గణించ కెంతయున్।
మాని మదీయమైనబలు,మాయతనంబునఁ బోయిచెంతక। మ్మానిసికొఁ
గిటకాదగులు,మాడిక నుపాయముఁబూని తుంటవి। లాకని జయింతు
నింతకడ,గాంచిన యాడిగముల్ ఘటింపుచున్ ॥ ౬౭ ॥

—*తూఁగుటుయ్యెలనుండి మోహిని తొలఁగి చనుట.*—

మ ॥ అనుచున్ జప్పుడు జేయ కొయ్యనను నె,య్యంబొప్పఁగాఁ



బొంచిమె । ల్లనగా డాసిన చిప్పతాళి వగలె,ల్లన్ గళికి క్రేఁగంటజూ।
చినదై యుండెలు ఘల్లనంగ నపుడా,శృంగారి యుయ్యాలడి । గ్గనగాఁ
దూకి భయప్రకంపిత కరం,గ ప్రక్రియన్ బాఱుచున్ ॥ ౬౮ ॥ చ ॥ భు
గభుగ మేనివాసన గు,బులోకన దృష్టికి గోచరంబుగా । మగువ దొ
లంగి పూపొదల,మాటున డాగిన శంభుఁ డత్తఱిన్। జిగిదగు తూఁగు
టుయ్యెలను,జెట్ట్వగ దానికి జేసువైనయ । ప్పగడపుఁదీఁగెన్ గని వి,
పన్నత నిట్లను మాటిమాటికిన్ ॥ ౬౯ ॥ క ॥ నీపైని గూరుచుండెను ।
వైపుల నట్టాలభాగ్య,వైఖరిచాలా । నీపాలం గలదిపుడో । హాపై
డుయ్యాలవేయు,యుక్తులిఁకేలా॥ ౭౦ ॥ గీ ॥ పడఁతి కర పల్లవంబులఁ,
బట్టెమిమ్ము । నేమి తపమాచరించి మీ,రెదిగినారొ । సుకృతమెల్లను
మీపాలి,సొమ్మె కాఁగ । తీరె నారార పగడంపుఁ,దీఁగెలార॥ ౭౧॥ గీ॥
వెలఁది నిన్నిట మూరొక్కనె,విరులసరమ । సుమనసులకైనఁ దరమెనిన్,
స్తుతియొనర్పఁ । బుణ్యతర వాసనలు మీకుఁ,బుట్టెనిల్లు । గాఁగవిధివిధి
యుంచుట,గలదుమొదల ॥ ౭౨ ॥ క ॥ అని చెలిమును గుప్పునదూఁ। కిన
ఛాలుగ రాలి దిగువ,గీల్కొను సరులం । గన చన్నుల నలఁదినచం ।
దనపుం బొడలెత్తికొనియుఁ,దద్దయు బ్రేమన్ ॥ ౭౩ ॥ క ॥ విరహజ
తాపము మిక్కిలి । భరమౌటను విరులసరులు,పలుమఱునత్యా । దర
మున మూరొక్కనుఁ గనుఁగవ । నిరవందఁగఁ జేర్చువంత,నెంతయు వ
గచున్ ॥ ౭౪ ॥ క ॥ చెలువగు గంధపుపొడి కర । తలమునగొని యొ
డలఁబూయు,తరుణి పదములన్। నెలసిన లత్తుక నెత్తుక । తలనిడుకొ
ను మమతగదుర,తాలిమి చెదరన్ ॥ ౭౫ ॥ సరసత పూలచేత కొను,
శంకరు పొంకముఁ జూడనొప్పెఁ బ । ల్మరుమరుతోడి చివ్వకయి,మా
మఱలయంగఁ గడంగునట్లుగాఁ । గరకరిమై లతాంగి మయి,గంధము
మేన నలందు చందమా । స్మరశర కోటికిన్ మిగుల,మాటుగ దాల్చిన
జోడుగాఁదగెన్ ॥ ౭౬ ॥ క ॥ అట్టి మెడఁ దనకు నిట్టుగ । నెట్టుకొనన్

బుట్టినట్టి,నిరుపమ తమకం। బుట్టుపడఁ బడఁతి యమగులు। మెట్టినచోడ
జాడఁబట్టి,మెల్లన జనుచున్॥ ౭౭ ॥ చనిమనంబున నిట్లని వితర్కించె॥ ఉ॥
ఎన్నఁడు దాని జేరుదువొ,యిం పుదలిర్చు పదంబులొత్తఁగా । నెన్నఁడు
దాని తళ్కుగమ్ము,లీనెడు చెక్కుల ముద్దొనర్తునో । యెన్నఁడు దాని
గుబ్బగవ,నిగ్గక బిగ్గన గౌఁగిలింతునో। యెన్నఁడు దానిఁ గూడి యెల,
యించి రతి స్మరు గొల్వ నేర్తునో॥ ౭౮ ॥ గీ ॥ అని వితర్కించి యి
ట్టులా,హరుఁడు మోహి। నీవిలాసంబు మదినెంచి,నెనరుమించి । యాల
చరాచరములగాంచి,యడుగఁ దొడఁగె। ముద్దులవధూటి తమి వసనం,
బునసునాటి॥ ౭౯ ॥

—— ✽ శివుండు చరాచరంబుల మోహినిజాడ నడుగుట. ✽ ——

సీ ॥ తిలకంబులార స్త్రీ,తిలకంబు మదసింధు రములార మత్తేభ,
రాజయాన । రాచిల్క గములార,రాచిల్క భాషిణి పద్మసంఘము
లార,పద్మపాణి। లికుచ సంతతులార,లికుచస తుక్చయుగ కుందబృం
దములార,కుందరదన । భ్రమర నికరములార,భ్రమర మేచకకచ హరి
ణ సంహతులార,హరిణనయన ॥ ౮౦ ॥ సరసిజములార లావణ్య, సర
సి సరసి । దీఁగె పొదలార మరువంపు,దీఁగెఁబోఁడి। కనకతతులార త్వ
న్నైక్రి,కనకగాత్రి । గనరే మీర లెందైనఁ,గానలోన॥ ౮౧ ॥ క ॥
విడఁబడె కనరేయనికను। గడకెడ్డ బైనవారిగ,మ పలువగలన్। నడుగు
చు నడుగులు తడఁబడ। జడముడిగల వేల్పుమిగుల,నడిసన్నతగన్॥౮౨॥
క ॥ దశదోహదంబు గాఁగను। దశగల్గిన భూరుహముల, దారిగని మ
హా । దశగల్గినట్టు లగునా । శశిధరుఁడి ట్లనుచుఁ బలికె,సత్ప్రియ మెసఁ
గన్॥౮౩ ॥ సీ ॥ సకియ నిన్నంటెనా,సహకార భూరుహ చంద్రాస్య
నగెనకే,సరమునిన్ను । కనియెనా తిలక సిన్,గాంతాశిరోమణి గానం
బుచేసెనా,కర్ణికాయిచట । ప్రియకవృక్షంబయా,ప్రియురాలి మొగసిరి
గాంచనీ కొదవెనా,కాంచనంబ । అతివ యధరసుధ,నానితే పకుళంబ



యువిద యెడదన్నునొప్పమిగిలి ॥ ౮౪ ॥ తేకురంటక యాబోటి,యీ
స్థలమున । తన్నెనాసిన్న శోకంబ,తలిరుబోఁడి । వనితయూమ్పులవా
విలీ,వన్నెగంటె । కన్నెపలికిన పూచితే,కర్ణికార ॥ ౮౫ ॥

—— ✽ మోహిని వనదేవతాస్త్రీలతో వనవిహారంబు సేయుట. ✽ ——

క ॥ అనిపలుకుచు జవ్వనిన । వ్వని వెదకుచుఁ జనుచున్న,వల
పులు గులుకన్ । వనివేలుపు టింతులతో । వనగుహాముఖి యెదుటఁగల
ర,వధ్వని చెలఁగన్ ॥ ౮౬ ॥ ఉ ॥ అమ్మః వీడుగానయిన యట్టివి యీ
వనమమ్మలారయా । మామిడి తియ్యమామిడిది,మాది ఫలంబన మాది
గాదుపొ । మ్మా మరియాదమించుఁ బలు,మాఱును నాగ్రహమేలె నీ
కు గొ। మ్మా మరులౌ ఫలంబులక్ర,మంబు లెఱుంగని తెల్వి బుద్ధితోన్॥
౮౭ ॥ ఉ ॥ కెంజిగురాకు గిల్లకువె,క్రిందటనల్లదె మంచివాసనల్ । రం
జిలు మల్లెపూలగుమి,రాజనిభానన చూచితేమరీ। మంజులమైన తేనియ
క్ర,మంబవిరా మదిరాక్షితీయుమీ। కుంజముజొచ్చి వేడుకలు,గూడఁగ
గ్రోలుదమేను నీవిటన్ ॥ ౮౮ ॥ సీ ॥ గొప్పలౌ ముత్యాల, కుప్పలట్లున్న
వీ యిప్పపువ్వులు మీర,తేరరెమె । బంగారు ముద్దుల,భంగినీ నిమ్మపం
డ్లున్నవి చూడరే,కన్నెలార । గోరంట విరులుమీ,గోరఁటబోఁడుఁడీ పో
రంటుకునుచాల,పొలఁతులార । అదిమికొంటిరి పువ్వు,లన్నియు వడినెం
త హంతలే మీరలో,యతివలార ॥ ౮౯ ॥ యానెడు ముచ్చటలెచ్చన,వ్వ
నములోన । నెలఁత యెలవోఁట వేల్పుగ,న్నెలనుగూడి। క్రొన్ననలఁగ్రో
సి యిప్పుడు,వన్నెలాఁడి। మెలఁగి శివుమ్రోల కొన్నిచి,న్నెలనటించి॥

—— ✽ పువ్వులందికోయు మోహినిని శివుండు కనుట. ✽ ——

ఉ ॥ అందని మ్రానికొమ్మ కొన,నగ్గలికన్ నెలగోలనొంచిచే ।
నందుకొనం గడంగునెడ,నాదట పైఁటచెఱంగు జారగాఁ । గ్రొందళు
కు న్నెఱుంగు జిగి,గుబ్బల నిబ్బెపు గబ్బిగుబ్బలన్ । బొందగు నారు
తీరునను,పొక్కిలిజూపు పురారి కేర్పడన్ ॥ ౯౧ ॥ చ ॥ అటువలెఁ బె

కుఱ రీతు,లలరారఁగ నవ్వని జారుపైటతోఁ। జిటిపొటి చెమ్మటల్ దొలుకు,చెకుఱలతో నెలతేటి రంతుచే। నటునిటు మోరమోమిడ వ,యారముతో నొకపొన్న గున్నచెం। గటమయి సేదదేర్చుకొను,కాంతఁ గనుంగొని శంభుఁడుబ్బుచున్ ॥ ౯౨ ॥ ఉ ॥ వీఁకఁ దృషాతురుండు చలి,వెఁదఱ *జెందినభంగి వొద్దుగా। నాఁకలిగొన్న యాతఁ డమృ,తాన్నము గాంచిన యట్లు గాఁగఁ దా। నా కలకంఠి ముందరికి,గ్రక్కునఁబోయి కరాబ్జయుగ్మముల్। చేకొని మోడ్చి యిట్లనియెఁ,జిత్తజబాణనితాంత వేదనన్ ॥ ౯౩ ॥

——* శివుండు మోహినితో దన మనోవ్యథఁ జెప్పుకొనుట. *——

సీ ॥ సన్నిధిజేరిన,సతి జగన్మోహిని రమణీయ లలితాంగ, రాగకలిత। మైనసీ కుచముల,నలరు వక్షఃస్థలి దయజొచ్చి యధరామృ, తంబొసంగి। నన్ను వేడుకతోడ,మన్నింపు నీచిత్త మిప్పుడు పలుకనే,నింక వెఱతు। నీకటాక్షంబింతె,నేపలుమాఱును దెలుపఁగా వెలసిన, తెఱఁగులేదు॥ ౯౪ ॥ నీకు మ్రొక్కెద నీవేళ,నీవు నాదు। నేరముల నెంచఁబోకుమో,నీరజాక్షి। నీరజాస్త్రుండు పగవాఁడు,నిన్నెనమ్మి। నాఁడ నను చును గట్టువి,ల్కాఁడు మరియు ॥ ౯౫ ॥ శా ॥ హేరాళంబగు బాళిఁ దాళుకొనలే,కేనింత చింతింపగాఁ। జేరంజీరవు గారవింపవుదయన్; జేపట్టవింతేనలే। నేరంబెంచి మరుండునన్ బొదువగా,నీకింత సంతోషమా। యీరారాపులు మాని యేలుకొనవే,యేమే జగన్మోహినీ ॥ ౯౬ ॥ చ ॥ అని మరియున్ శివుండు,ప్రియమారఁగ నిట్లను ముద్దుమీరున। క్కనక సుగాత్రితోడఁ,గలకంఠిరొ నీ నుదురన్న భంగినై। దనరుట బాలచంద్రుని ము,దంబున గన్గొని ప్రేమమించనే। ననవరతంబు మెచ్చొదవు,నట్లుగ నిన్ శిరసావహించితిన్ ॥ ౯౭ ॥ క ॥ కులుకులు గల నీనడతో। గలహించునొ యనుచు గాదె,గంధగజేంద్రున్। బలుగర్వ మడఁచి వైచితి। చెలువా దయసేయరాదె,చిత్తంబలరన్॥ ౯౮ ॥

క ॥ అలనా నీచూపుల బెళు। కులు గలవని ప్రమదమెసఁగఁ,గోరిక మిగులన్। గలవాఁడనగుచు వేడన్। బలుమరుఁ జేపట్టియున్న,భావము గనవే॥ ౯౯ ॥ క ॥ నీవాఁడ నీదు దాసుఁడ। భావజ విరహాగ్ని పాల,బడకుండఁగనన్। గావుము తమి నిలుపఁగలేఁ। గావున నీకౌఁగిలిచ్చి,గావుమనన్నన్ ॥ ౧౦౦ ॥ క ॥ తలయెత్తుము మాటాడుము। చెలియిక్కడ చాటుమరుగు,చేరిక పొదలో। పలుఁగూడి మాడి వేడుక। సలుపగ నెళవిందు రావె,జాగేమిటికే ॥ ౧౦౧ ॥ శా ॥ మౌనంబున్ దొలఁగించి ముద్దుగులుకన్,మాటాడవే కోమలీ। నేనీలాగున నాసపడ్డ ననుమన్నింపంగ రావేమె యిం। పునను్ గౌఁగిటఁ జేర్చుకోగదవెయం,భోజాస్య యెచ్చోటనే। గానన్ జూచియు నిన్నువంటికఠినా,కారిన్ జగన్మండలిన్ ॥ ౧౦౨ ॥

——* శివునికి మోహిని కనంబడి మాట్లాడి మఱల మొఱంగుట. *——

మ ॥ అనియీలాగున మోహమగ్ననిపుణో,ద్యద్దీన భాషాప్రవర్ధనుఁడై భంగపడంగ శంకరునితో, రాజాస్య వల్కెన్ మనో। జుని సాధించిన నీకు మోహమెటులై,సొక్కెన్ మదిన్ లోకమం। దునన న్నీవొక భామగాఁదలఁచి యెం,తోవంత చింతించినన్॥ ౧౦౩ ॥ క ॥ వద్దికయాడునె నీదగు। గద్దరియా హృదయశుద్ధి,గట్టిగ నేసుక్। బద్ధన శోధింపకనని। ముద్దియ యంతటనె మాయ,మగబో ...నచోన్ ॥ ౧౦౪ ॥ క ॥ కళకళ మందుచు దిక్కులు। కలయగ నలుగడలు జూచి, కానక మదిలో। పలఁ జింతసేయునంతన్। గొల నొక్కటి గానఁబడియె,గొబ్బున నపుడున్ ॥ ౧౦౫ ॥

——*శివుండు జలక్రీడలాడు మోహిని నొక్కచో మఱలజూచుట.*——

వ ॥ ఇట్లమ్మోహినీ సందర్శనోత్కంఠుండగు నీలకంఠుం ... వళ దేహకాంతిచ్ఛట లుభయపార్శ్వంబుల వైచు చామరం ... న్మకుట చంద్రమండలంబు మండిత పుండరీకచ్ఛాయా సముద ...

ప్పఁ గాండ వేదండ ప్రకాండంబులు గజాంతర్లక్ష్మిఁ గాఁ దరంగ మాలికలు తురంగావళీక్రమంబుగా తటీనికట ఫేనవితానంబులు శోభమానదుకూలంబులుగా నీరమానుష కుమారులు సేనా పరివృతంబుగా కల్హారాంతర పరాగ పటలంబు వాసనావాసిత చందన చర్చగా కాంచనకంజ పుంజ మధ్యరంజిత కింజల్క దీప్తి నీరాజన దీపికా శిఖా విభాసమానంబుగా మకరంద రసాస్వాదన ప్రమోద భృంగ సంఘ ఝంకారంబు వందిమాగధ బృందగాయక సందోహ పఠిత గద్య పద్య మంగళ సంగీత భృంగీకృతంబుగా సముచిత నిజజీవనాసక్త దిగంతరాగత ద్విజ నినాదంబు లాశీర్వాదంబుగా నొక్క సరోవర సార్వభౌమంబు తత్పో భాగంబునన్ గనుపట్టి తత్తటంబునందొక్క చిత్రపటంబుండుట దోఁచిన మిక్కుటంబైన దిటంబు వ్యాప్తుటంబునన్ బాటమరిల చెంగటికిం బోవు నిటలాంబకుదృష్టిపథంబున నక్కుటిలాలక జలక్రీడా సంరంభయై ॥ లయ ॥ సోలుచు సరోజములు దూలుచు పరాగముల రాలుచు రథాంగివలె వ్రాలుచును గేళిన్ । దేలుచు మృణాలములఁ జీలుచు మరాళములఁ దోలుచుదరిన్ లతల వ్రేలుచును బాళిన్ । త్రేలుచు ఖగార్భటులఁ దాళుచు మిళిందములఁ దోలుచు మరందములఁ గ్రోలుచునుహాళిన్ । గ్రాలుచుఁ గొలంకుఁ బొరిమాలుచు జలేభమనఁ జాలుచు సుధారుచుల నేలుచుఁ జెలంగెన్ ॥ వ ॥ ఇట్లు జలక్రీడలాడుచు సుమరీచియుం బోలెఁ దేజరిల్లు నమ్మాయలాఁడి నవ్విటచూడామణి హర్షణంపుచు॥ ౧౧౦ ॥ గీ ॥ జలములోనున్న దింతివ,స్త్రంబు లేక। చిక్కె తెక్కలిక త్తైనా, చేతనిప్పు। డెక్కడికిఁబోవ నీనింకని, కల్కికిని । బట్టుకొనిమోదఁ గాకని, పటుజవమున ॥ ౧౧౧ ॥

—(*){ జలకంబాడుతఱి నీవు రావలదని మోహిని శివుని వారించి కన్మొఱంగుట. }(*)—

క ॥ కొలను వడిఁజొచ్చి విరహ । జ్వలనం బినుమడిగ వేగ, వచ్చెడు శివునా । కులుకుల గుబ్బెతకనుచున్ । బలికెన్ భ రాకు రాకు, భర్గా యిటకున్ ॥ ౧౧౨ ॥ గీ ॥ కోక లేకున్న తఱి వచ్చి, కాకుసేయ । నీకు ధర్మమె నిలునిలు, రాకటన్న । దానివిని నిచ్చ దీనిచి, త్రంబు నాదు । పైనహత్తిన యదిమనో, భావమునను॥ ౧౧౩ ॥ గీ ॥ కాన తమకింపనేలని, కలుగువంత । చింతయుంతయుఁ బాయంగ, శివుఁడు వేడ్క । సరసి వెలువడి యరసియు, సరసిఁబెరసి। కలుగు పాదదండఁగను చాటు, గాఁగ నుండ ॥ ౧౧౪ ॥ గీ ॥ కోకగట్టంగ నిప్పుడే, కొలను వెడలి । వచ్చు వచ్చిన మచ్చిక, మెచ్చునన్ను । రతులగలయును మాఱుత్త, రంబులిచ్చె। నన్న తలయెత్తి చూచెన, వ్వన్నెలాఁడి॥ ౧౧౫ ॥ క ॥ మటుమాయలాఁడి యపుడం । తటిబో నేటుబోయెనో, సుధాకర ధరుఁడు। తక్కటహర్షము వ్యాప్తటమున । దిటముగ నెలకొల్పియుండి, తిన్నఁగ మఱియున్॥ ౧౧౬ ॥ గీ ॥ తిరుగ కొలనివంకఁ, దెలియంగఁ గనుగొని । కలికి లేకయున్నఁ, గలకగదిరి । దిగులు చొరఁగమదికి, దీనతవాటిల్లఁ। బలువరింపఁజొచ్చె, బహువిధముల ౧౧౭ ॥ ఉ ॥ అయ్యయొ మాయలాఁడి వగ, లారసియున్ దెలియంగలేకనే । చయ్యన మోసపోతి నేటు, జారెనో కానన కానలందునే । నెయ్యెడఁ గందు ముందువలె, నెంతటి భాగ్యవిహీనుఁడన్ సుమీ । తొయ్యలి యింకఁజిక్కునె మ, తుల్ నెడువారికి నేర్పుదక్కునె ॥ ౧౧౮ ॥ సీ ॥ ఆకన్నులవిలాస, మాచన్నుల బెడంగు లాతళుకుచెక్కుల, చందచంద । మాటక్కు లానిక్కు, లయ్యారజపుమాట లాపాట లాయాట, లాయొయార । మాయొడ లాతొడ, లామిటారంబును కన్నులగట్టిన, ట్లున్నదిప్పు । డెక్కడ నేగాన, నీ విరహాంబుధి నేతెప్ప కడతేర, నీదగలను ॥ ౧౧౯ ॥ నీవియోగాగ్ని నేమిట, నింక నాతుణ । నింక నెక్కడ గనుగొందు, నింతిననుచు । కడఁగి దిగజారుచున్నయ, కన్నునీరు । గోటఁ కడమీటుచును వచ్చి, కుధరధన్వ ॥ ౧౨౦ ॥ క ॥ కాసారతీర సైకత । భాసురసు స్థలమునందు, బహులంబగుచున్।

భాసిల్లుచున్న పుష్పొడి। రాసులకడ వ్రాలి నేల, రాఁగఁబడరే ॥౧౨౧॥

— ✻ విరహాగ్నిచే శివుండు పవనాదుల దూషించుట. ✻ —

క ॥ మరులున బొరలుచుఁ దెరలుచుఁ। బరిపరివిధములను దైన్య, భాషణలీలా। పరుఁడై విరహానలమున। విరవిర పుష్పొడుల కడను, వెతఁబడునపుడున్ ॥ ౧౨౨ ॥ క ॥ తావుల కమలాకరముల। తావుల తావలముగల్గి, తావలసుగుచున్। బ్రోవుల చెలువల వలువల। ప్రోవులలిన్ జెలఁగి మలయ, పున్ గాడ్పమరున్ ॥ ౧౨౩ ॥ గీ ॥ చిఱుతమారుతమునఁ జెదరిపు, ష్పొడిపైని। బడఁగ మిడుఁగుఱుట్లు, బగ్గుమనఁగ। మెట్టకెందొవజిగి, చుట్టిన దావాగ్ని। కరణిమిగులభయము, గడలు కొనఁగ ॥ ౧౨౪ ॥ క ॥ కలహంస నినాదములున్। బలుతుమ్మెద రొదలువివిధ, భంగులవేడిన్। దలకొనినవాఁడి శూలము। లలరన్ జెవులందు నాటి, నల్లై మఱియున్ ॥ ౧౨౫ ॥ గీ ॥ తల్లడిల్లుచుండి తామరమొగ్గలు। తరుణి గుబ్బలనుచుఁ, దత్తరించి। చూచి కాకయున్న చోనుస్సు రనుచును। జాలనుమ్మలించి, జలదరించు ॥ ౧౨౬ ॥ క ॥ కలువల గనుకొని కన్నియ। కలికి విలోచనములంచుఁ, గడుహర్షించున్। బలుమారు నవి గాకున్నను। వలవలఁ గన్నీరునించు, భ్రమఁబలవించున్ ॥ ౧౨౭ ॥ క ॥ ఈలాగు వగలఁ గుందుచుఁ। జాలింబడి మలయపవనుఁ, జందురు మదనున్। గైలాసపతి దలంచియు। హేలాగతి నిట్టులనుచు, నెంతయుఁ బలికెన్ ॥ ౧౨౮ ॥ గీ ॥ నిన్ను మేఁతగొనిన, పన్నగమ్ములవల। యాముగఁ జేసి పెట్టి, నట్టిమేలు। మదిని దలఁపకీవు మందా, నిలుఁడనన్ను। సుడిసి వేఁడిగాఁగ, సోఁకఁదగునె ॥ ౧౨౯ ॥ క ॥ మలయ నగంబున విషధర। కులములతోఁ గవిసిమనిన, కుత్సితమతినీ। వెలమి నుపకార మెఱుఁగుదె। మిలమిల నిను పాముగఱచి, మ్రింగదె పవనా ॥ ౧౩౦ ॥ గీ ॥ అనుచుఁ జంద్రునిజూచి యిట్లనియె హరుఁడు। తెలుపు నలుపున నావలెఁ, దేజరిల్లి। సోముఁడనిమించ దిశలసం, స్తుతివహించ। భూరికరముగ మ



చ్చిరో, భూషణముగ ॥ ౧౩౧ ॥ మ ॥ వలనొప్పన్ ధరనోషధీ పతిగసిక్, వాక్రువ్వఁగాఁ జంద్రకే। వలమున్నే శిరసా వహింప కుటిల, త్వప్రక్రియన్ నీవుమున్। దలయెర్మాన్వకానినీ యుష్ముతహా, స్తంబెల్ల బోకారమి। కిలి గావింతురె మన్మథ జ్వరము దు, ష్క్రీడన్ గురుద్రోహివై ॥ ౧౩౨ ॥ మ ॥ జనకుండప్పుల భంగపాటుఁబడఁ బట్టుంబొక్కటన్ లేకమి। త్రుని వృద్ధ్యాశనుడాగి కన్పడకత, ద్రూపావసానంబునం। దున వేవేగను దెల్విఁ జూప్పడఁగనున్, దోఁతెంచి మిన్నందు నిన్। గనితమ్ముల్ తలవంపనుందువు మృగాం, కా యుగ్ర చూడామణీ ॥ ౧౩౩ ॥ క ॥ ఇల దోషాకరుఁడనఁగా। కలగన్ సారంగధరుఁడు, ఘనుఁడననొప్పే। రెలమినిడి శేఖరంబుగ। నిలిపితినవి తలఁచకెంచ, నీకౌనె శశీ ॥ ౧౩౪ ॥ క ॥ అనిమఱియు మదను మదిలో। ననఘుఁడు గుఱిజేసి పలికె, నో రామారా। మును నన్ను నీవెఱుఁగుదు। విను మధికులతోడిపగ వి, వేకుల కగునే ॥ ౧౩౫ ॥ సీ ॥ కూటువగుంపుల, పోటునమ్మక మునీ వెరుఁటరూపయి నిల్వ, వెపుడు మదన। ద్విజుఁడనుమాత్రమే, విధుఁడు సంధ్యలయందు నియమంబు గనఁడువ, ర్ణింపుమదన। పల్లవాస్పదవృత్తిఁ, బరఁగు వసంతుండు సతముగానుండడె, చ్చరిక మదన। మూలకునోదుగుపా, ములనోరఁబడిసుర్కున్ మలయానిలుండు చం, చలుఁడు మదన ॥ ౧౩౬ ॥ వీరలు నుమఱి చండాల, వృత్తినిగురుఁ। బొడిచి తినువారు కలుఁ ద్రావఁ, బోవుసల్ల। మూఁకలునుగూడ పలుమారు, మోహరించి। వచ్చెదవు చేటుపాటగు, వలదు మదన ॥ ౧౩౭ ॥ గీ ॥ శివుఁడు కాముకుఁ డనుమాట, చెల్లకుండ। సగము దేహంబొసంగితి, నగజకేను। నదిగణింపక నీవున, న్నలచుటదియు। చలమొ రా మారహాస్యంగ, సవన మదన ॥ ౧౩౮ ॥ చ ॥ వినుమిదె మోహినిన్ గదిసి, వేడుకతోఁ గుచదుర్గ యుగ్మము। య్యాఁగొని కైవసంబయిన, యంతనె చిక్కిన మధ్యదేశమున్। గనికటిసీమకున్ మిగిలి, కామితమా రతిరాజ్య మేలుచో। ఘనముగు మో

హావుల బలిమి,కల్మిని నేనును నిగ్రహించెదన్॥ ౧౩౯ ॥ గీ ॥ అనుచు లేచుచుఁ బొరలుచు,హాయటంచు। నట్టె బయలాలకించుచు,నదుగొ కాంత । యనుచు భ్రమఁగొని కౌఁగిట,నదిమికొనుచు । నువిద లేదన్న నడలుచు,నున్నయపుడు ॥ ౧౪౦ ॥

—✻ మోహిని శుకరూపంబునవచ్చి శివునితో మాట్లాడుట. ✻—

క ॥ ఆమాయలాఁడి చిలుకై । యామన్మథు రిపునికడకు, నతిశీఘ్రమునన్ । దామెరసివచ్చి పలికెడి । నీమాటికి వగలబొగల,నేటికిరుద్రా ॥ ౧౪౧ ॥ ఉ ॥ బాలికఁ జేరవేగ మరుఁ,బాళి విరాళినిగూడి మాడియె । లీలనునైన నీవు తర,ళీకృతలోచన నాత్మ కింపుగా । నేలెదు నట్లుగాఁగ నగు,నేమిటికీవగఁ దల్లడిల్లగాఁ । జాలిఁ బడంగనిట్లు దివి,జప్రచయంబు వినంగ నవ్వదే॥ ౧౪౨ ॥ గీ ॥ అనిన నమ్మాయ చిలుకతో, నభవుఁడెలమిఁ । బలికె సన్నుతియించి పెన్,భ్రమలముంచి । పోయినటువంటి బంగరు,బొమ్మ కొమ్మఁ । గూర్పవేముద్దు పలుకుల,గులుకుచిలుక ॥ ౧౪౩ ॥ క ॥ నాపాలి భాగ్యదేవత । వైపొలుపుగ వచ్చినావు, హంసగమనతో । వైపలర గూర్పనీవే । ప్రాపుసుమీ తనకుఁదీపు,పలుకుల చిలుకా ॥ ౧౪౪ ॥ క ॥ చిలుకలకొలికిని గూడక । చిలుకా యెడ వైన మరుఁడు,చిలుకల ములుకుల్ । చిలుకంగఁ జిలువతాళికి । జులుకన్ ప్రాణములువెడల,జూచుస్మీ నన్ ॥ ౧౪౫ ॥ క ॥ అని ప్రియము గులుకఁ దనుబ । లికినముద్దుల పలుకు-చిలుక, క్రీయుగిలొకనగ్ర । కకనఁ దళుకు కలికిగలచ । క్కన యమువుగఁ జిలుకసూప,గిరిగొను తమితోన్ ॥ ౧౪౬ ॥

—(✻) పూఁబోఁడలో సురతోద్యుక్తరూపిణియై మోహిని శివునికిం గానవచ్చుట. (✻)—

గీ ॥ ఆకురంగధారి యలిగి,కుఱంగటఁ । బువ్వుఁబోదల నవ్వు, నివ్వటిల్ల । రవ్వలాడియైన జవ్వని,రతికిను । న్ముఖము గల్గినట్లు,ముద్దు మెఱసి ॥ ౧౪౭ ॥ సీ ॥ పైటదొలఁగిబట్ట,బయలైన బటువుగుబ్బలమీఁదఁజుక్కల,వలెనుహార । వల్లరుల్ చెలువొంద,వలనొప్ప గపురంపుఁ దావివీడెపుఁగావి,మోవిదీవి। నెరయ నీవి సడల్చి,గరిమ నొయ్యన శయ్యపైని ముద్దులిటారి,బాగుమీఱి । యుండంగఁ గనుగొని,ఖండేందుశేఖరుం డల్లంత రాఁజూచి,యతివ లేచి ॥ ౧౪౮ ॥ కులుకు పాలిండ్లపై పైట,కొంగుగప్పి । సిగ్గు జగ్గున బొలిచియు,చెలువ నిలిచి । యున్న యమ్మాయ మతకరి,యున్నమిన్న । గూర్చి యిట్లను మన్విగా,కుధరధన్వి॥ ౧౪౯ ॥ గీ ॥ మెచ్చవచ్చును వంచన,మేలుమేలు । చాలుఁ గూర్చుండు లేవఁగా,నేలయిపుడు। వినయపరురాల వౌదువు,వెలఁదినీవు । చూడఁగ వివేకమెల్లనీ,సొమ్మెసుమ్ము ॥ ౧౫౦ ॥ చ ॥ అనుటయు మందహాసమున,నయ్యమృతాధర ముద్దుమీగసాం । త్వనముగఁ బల్కె దేవరవు,వచ్చిన లేవక యుండవచ్చునే । యనినను దేవరంచును బ్రి,యంబున నీమది గల్గియున్న నన్ । బెనువెత నిట్లు బెట్టుదువె,పెద్దయు పద్దున ముద్దుకోమలీ ॥ ౧౫౧ ॥ క ॥ నావినియా వనితమహా । దేవునకిట్లనియె దేవ,దేవుఁడవగునిన్ । నేవెతలఁ బెట్టలేదును । మీ వేఁదుఱు లగుచునన్ను,మీరననగునే ॥ ౧౫౨ ॥ క ॥ అనినన్ శివుఁడను వనితా । వనమునసీ విటులడాగ,వచ్చునె నన్నున్ । గనుటకయి తిరిగి సొరిగితి। ననఁగా నక్కలికి పలికె,నాతనితోడన్ ॥ ౧౫౩ ॥ క ॥ ఎప్పటిచోటనె నాదగు । చొప్పన నేనుండ నన్ను,సురిగితివని । నీ ప్పాటం బలుకుటయది నీ । తప్పగుటన్ మదినెఱుంగ,దలఁపవు రుద్రా ॥ ౧౫౪ ॥ సీ ॥ అనిన నిట్లనురుద్రుఁ,డతివతో విరహాగ్ని తనికియుండఁగ నెట్లు,దాళియుంటి । వననింతి యిట్లను,వినుము కాఁగలకార్య మునకుఁ దాళక యెంత,మూఢుఁడైన । కడువేగఁ బడఁబోనె,కనవలదా బుద్ధి కుశలత ననిన న,కుధరధన్వి । ధరణిలో నీవంటి,తాలిమికత్తెనె కడగానవే నన్ను,పడఁతియనియె॥ ౧౫౫ ॥ షీ ॥ తిని జెలువలలో జత,జేసినన్ను । కూడఁదలఁచిన నీకుఁజి,కుకుదునె రు

ద్ర । యనిన జిక్కితి పిఁకనైన,నలరువిలుత । వెతలఁబెట్టక ననునేల, వే
యొయారి॥౧౫౬॥ మ ॥ అనినన్ దావిరి శయ్యాలేదనిన న,బ్జాతాక్షితో
నాతఁడి । ట్లనునో ముద్దులగుమ్మ లేచి యిటులా,య్యారంబుతో వచ్చి
ద్ర । కన్న నాదౌవడిమీదటన్ దమిసెలం,గన్ గూరుచుండంగదే।య
నఁగకూర్మిరితి వాఁడవీవనుచు రా,కబ్బోటి యిట్లున్నచోన్ ॥ ౧౫౭ ॥
సీ ॥ ఆలించి నాపలు,కకుర్చనజేస్పవే కడఁగినీ గుబ్బచ,న్గవమదీయ । వ
క్షమొయ్యనినాన, పత్తుముంచవెనిన్ను వలచిన వాఁడనే,తలిరుబోఁడి। ఆ
లస్యమేలనే,త్రైలోక్యసుందరి చేరరావే మరు,చేతిరంతు । నోర్వఁజా
లనైయని,యుగ్మలిడాయంగఁ జేరి కౌఁగిటఁజేర్పఁ,జేతులప్ప ॥ ౧౫౮ ॥
ళించ నబ్బోటి వడదట్టి,లీలనల్ల । నల్లనను బోవఁ బోవంగ, మెల్లమెల్ల ।
శివుఁడుగదిసియు నమ్మనో,భవునిబాణ । తతుల వెతఁబడె మిగుల ద,
త్తరముగాఁగ॥౧౫౯॥

—(*) { శివుండు మోహినింబట్టి కౌఁగిలించి స్ఖలితరేత స్కుండు కాఁగా నమ్మోహిని విష్ణురూపంబుదాల్చుట. } (*)—

చ ॥ అనువగు మోహ ముప్పతిల,నందముగా నొలఁగట్టిగాఁగఁ
గ । ట్టినపులివన్నె పట్టుజిగి,కెకుర్ల దుప్పటిజార నాత్మలో । నెన
సిన గుట్టుమట్టుగల, దెల్లబయల్పడ వీడఁగా జడల్ । వనితనుఁ బట్టఁగాన
దియు,వాల్చలు కీల్జడ గొట్టఁ గొట్టినన్ ॥ ౧౬౦ ॥ ఉ ॥ కొట్టినకోర్చి
దిట్టఁడయి,గొబ్బునఁ బయ్యెదఁ గులుకు గుబ్బలున్ । బట్టినఁ బట్టనీక,చ
ల,పట్టి కరంబును దిట్టనెట్టన్ । బట్టి బయల్గ గుట్టుకను,పట్టఁగఁ గట్టిగఁ
గౌఁగిలించి పెన్ । గొట్టును రట్టునా తమిని,గోర్కె ఫలింపఁ జెలఁగు
చుండఁగన్ ॥౧౬౧ ॥ చ ॥ కడువడి నంగనన్ బిగువు,కౌఁగిట బిగ్గఁగఁ
జేర్చుకొన్నయి। ప్పుడె తనువెల్ల ఝుమ్మురన,భోరనబారిన శుక్ల మేఘు
లై । మడుగులు కాల్వలై ధరణి,మండలిసోకిన చోటులెల్లఁ బు । త్త
డియును వెండియైతగ,నతండును గాంచెను బారవశ్యమున్ ॥ ౧౬౨ ॥



గీ ॥ పారవశ్యమంది పదపడి,కన్నులు। విచ్చి చూచినపుడు, విచ్చలముగఁ।
జెలువు గులుకుచున్న శృంగార,వనమెల్ల । నప్పుడున్న సభగ,నొప్పమి
గిలి ॥ ౧౬౩ ॥

—(*) { శివుఁడు విష్ణుంగాంచి బ్రహ్మజ్ఞానమొంది తన తెలియమికి సిగ్గువడుట. } (*)—

సీ ॥ కటకాంగుళీయక,కనకహారంబులు తళుకుల కన్నులు, బెళు
కుకొప్ప । బింబాధరము చంద్ర,బింబ ముఖంబును మందయానము సిం
హ,మధ్యమహిమ । బటువుగుబ్బల గుల్కు,మటుమాయలాడు తనం
బైన యట్టిరూ,పంబుమాని । శ్రీకాంతతో హరి,చెంతనె ప్పటియట్లచి
ఱునవ్వు మొగమునఁ,జెంగలింప ॥ ౧౬౪ ॥ లలితలీలలఁ దత్సభా,స్థలివ
హించి । యున్నఁ గన్నులఁ గనిశివుఁ,డున్నతముగఁ । దనహృదయము మ
నుపర్వత,మునఘనముగఁ। బ్రకటమైన బ్రహ్మజ్ఞాన,భానుఁడొదవ॥౧౬౫॥
చ ॥ తెలివిఁదనర్చి హ్రీయుగుమ,దిన్ గని యియ్యది విష్ణుమాయనేఁ । ద
లపఁగనేరనైతిఁ దొలు,తన్ వలదంచునె గౌరిపల్కెనీ । నళినదళాక్షుఁ
డున్ వలద,నంగను మానక నాడుసేయఁగాఁ । గలుగుటగాదె యీస
భన,గన్ మఱి తత్ఫలమందుటీవగన్ ॥ ౧౬౬ ॥ గీ ॥ అనుచుపీడిన జడలు
మేలనువుగాఁగ । వ్యాఘ్రగజచర్మములు తగు,వైపుమేన । నుంచికొని
పొందుగాసవ,రించుకొనుచు । శివుఁడు నిందాస్తుతులు తన,చిత్తమం
దు ॥ ౧౬౭ ॥ గీ ॥ సరిగనెంచుచు శాంతని,ష్ఠాగరిష్ఠ । చింత యలవ
డఁగానుండె,నంతనలువ। తామరసనేత్రు మాయచే,దములఁబొగడె।
తామసించక తచ్చరి,తములతోడ ॥ ౧౬౮ ॥

—(*) లక్ష్మిప్రభృతులు విష్ణుమాయ నుతించుట. (*)—

క ॥ మీమాయఁ దెలియవశమే । స్వామీయని రమనుతించె.శం
కరుమరుబల్ । బాములబ్రిమ యించితిరని । శ్రీమంతున్ విష్ణుదేవు,
శివ కీర్తించెన్ ॥ ౧౬౯ ॥ ఉ ॥ వేలుపు పెద్దరాణియును, విష్ణుని మాయ

ల లీలలెల్లనా । నాలలితాను రాగ నట, నక్రియతాళ లయాదు లేర్ప
డన్ । జాలఁగ మంగళప్రదమె, సంగఁగఁ బాటలు పాడె వేగమే । వే
ణువు భేరులున్ మొరసె, విస్ఫుట బంధుర సుందరంబుగన్ ॥ ౧౭౦ ॥

—(*) నారదుండు సంతోషంబున గంతులు వైచుట. (*)—

గీ ॥ కూర్మి సంతోష పడిరెల్ల, సురలు మునులు । బహువిధం
బుల శ్రీహరి, మహిమఁ గాంచి । యట్టి యెడలేచి సంతోష, మట్టిప
డఁగ । కన్నులొగివిచ్చి సభయెల్లఁ, దన్నుఁజూడ ॥ ౧౭౧॥ గీ ॥ బంటు
పంతంబు మాని సం,భ్రమున లేచి । శివునిఁ జిక్కించి సన్నుఁగా,చితిర
టించు । నారదుఁడుకుంచె విసరుచుఁ, బాటిబాటి । గంతులొగివై
చె బిట్టుగా,యంతు లేసఁగ ॥ ౧౭౨ ॥

—(*) శంకరుండు విష్ణుతో నీమాయ నెఱుఁగని నన్ను మన్నింపుమని వేడుట. (*)—

ఉ ॥ అప్పుడు శంకరుండు కమ, లాసనముఖ్య సుపర్వ వంద్యు
నిన్ । దప్పక విష్ణుఁ జేరి ప్రమ, దం బెసఁగన్ వినుతించె లోక మం
దెప్పుడు నిన్నెఱుంగుదు న, హీన మహాబహు శక్తి యోన్నతుల్ । సొ
ప్పడ నెంత వారలను, జుల్కనఁ జేయుదు వాత్మ శక్తిచేన్ ॥ ౧౭౩ ॥
క ॥ నీనెఱిఁగి యెఱిఁగి నిన్నున్ । మానని వాగ్వాదవృత్తి, మారొక్కం
టిఁగదా । పూనినదుఁ జిన్నవుచ్చితి।మానిని రూపానరఁ దాల్చి,మధు
దమన హరీ ॥ ౧౭౪ ॥ క ॥ నిన్నెన్న నెఱుఁగ నన్నున్ । మన్నింపుము
గౌరవముగ, మాధవ యంచున్ । విన్నప మొనర్ప విని సం । పన్నుఁ
డు హరి నెనరుదోఁపఁ,బలికెఁ బ్రియమునన్ ॥ ౧౭౫ ॥

—*విష్ణుండు శివునితో నీకునాకుభేదంబులేదని సంతసపఱచుట.*—

క ॥ నేననఁగా నీవనఁగా । మానుగ మన కిద్దఱకుఁ గ్ర,మంబు
గ భేదం । బేనాటి కేని గలదే । మానుం డుప చారమేల, మన
లోమనకున్॥ ॥ ౧౭౬ ॥ దేవతల లోపల మహా । దేవుఁడ వీవెన్నస



కల, దిగ్ధరణి ముఖ । స్థావర జంగమ ములు మరి । నీవే యెల్లిందుఁ
దెలియ, నీవేనేనున్ ॥ ౧౭౭ ॥

—(*) శివుండు విష్ణునివీడ్కొని నిజనివాసంబున కరుగుట. (*)—

చ ॥ అనితగఁబలికి ప్రేమమున,నంపఁగఁ బెంపు దలిర్పఁ గామ
దిన్ । ఘనుఁడగుశంకరుండు త్రిజ,గత్పరి పూర్ణుఁడు వచ్చినట్టి వా । ర
నువుగ వెంటనంటి విన,యంబునఁగొల్చి భజింపఁగాఁ జనెన్ । దననిజ
వాససీమకు ము, దంబున నెప్పటి యట్ల వేడ్కతోన్ ॥ ౧౭౮ ॥ క ॥ అ
ని వైశంపాయన ముని । జనమేజయునకును విమల, చారిత్రునకున్ ।
విన విన వేడుక పరిగొన । వినిపించినపుణ్యకథ వి,వేకస్ఫూర్తిన్॥౧౭౯॥

—(*) ఫలశ్రుతి. (*)—

గీ ॥ రేయిఁ బగలు విష్ణు, మాయ విలాసమీ । కథపఠించి వ్రా
యఁ, గన్న విన్న । జనుల కెల్లఁ బుత్రి,సంపద లాయు రా । రోగ్య
భాగ్యములు ని,రూఢమగును ॥ ౧౮౦ ॥ శా ॥ నానారత్న విచిత్ర భూ
షణకళా, నైపుణ్య మూర్ధన్యగా । రీనారీ రమణాంఘ్రి పద్మ విలస,
ద్భృంగాంతరంగాజను । శ్రీనిత్యోత్సవ మందిరాంతర బహు, శ్రేయ
స్కరాబంధుసం । తానా వెల్గొటి బంగరేవ నృపతీ,ధర్మజ్ఞ విద్వన్నిధీ॥

గద్య॥ ఇది శ్రీమద్దత్తాత్రేయ గురు చరణారవింద మకరందబిందు
సందోహా నంద మాన సేందిందిర భద్రకాళీ వరప్రసాదిత
కవితా చమత్కార కుమారయాచ నృపదత్త తిక్కయ
జ్వ నామాంతర భాసుర రోసనూరి లింగ నామా
త్య పౌత్ర గంగన మంత్రి పుత్ర కాశ్యప గోత్ర
పవిత్ర వజ్రకంకట విశంకటమతి వేంకటపతి
కవిప్రణీతంబైన విష్ణుమాయా విలాసం
బను శృంగార ప్రబంధంబు నందు
సర్వంబును తృతీయాశ్వాసము
సంపూర్ణము.

---

